పైరులు బాగులు, పదులు పొంగాయి. పై పిడాదిపంట బాగానే వుంటుందనుకోవచ్చు ఇక కొద్దివారాలలో చాలా ప్రాంతాలలో రెండోకారు పంట చేతికి అందుతుంది పైనా మనదేశానికి ఒకలక్షటన్నుల బియ్యం ఎగుమతి చేయటానికి అంగీకరించింది. కేంద్రప్రభుత్వం లోగడ విదేశాలనుంచి అందగల బియ్యం దక్షిణాదికి యీయగల నని వాగ్దానం చేసివున్నది ఈ అన్ని కారణాలచేత యిప్పట్లో—అంటే రాబోయే 10, 12 నెలలలోగా, బియ్యం అయిపోతా యన్న దిగులు వుండటానికి అవకాశం లేదు మన రాష్ట్రంలో యీ రోజు రేష నింగ్ అమలులో వున్నది 70 ప్రదేశాల్లో మాత్రమే. అంటే రాష్ట్రజనాభాలో 10 వంతు మందికోసమే రేషనింగ్ అమలు జరుగుతున్నదన్నమాట రేషనింగ్ అమలులోవున్న ప్రాంతంలోనైనా కేవ లమూ రేషన్‌గింజలతోనే సరిపుచ్చుకొనే వారు యించుమించు ఎవరూ లేరు అందరూ బ్లాక్‌మార్కెట్టు బియ్యం కొనుక్కొంటూనే వున్నారు. రేషనింగ్ ఎత్తివేయటమే జరిగితే బ్లాక్‌మార్కెట్టు ధరలు తగ్గుతాయని చెప్పవచ్చు రాష్ట్రప్రభుత్వం వారు కూడా రేషనింగును ఎత్తివేయటం వైపుకే ఎక్కువగా మొగ్గుచూపుతున్నారు. మద్రాసు ఆహారశాఖమంత్రిగారు యీ వారంలో ఒకచోట ప్రసంగిస్తూ కంట్రోళ్లు వుండటం అసాధారణ పరిస్థితుల్లోమాత్రమే సమర్థనీయమనీ, సాధారణపరిస్థితులలో అవి వుండనక్కరలేదనీ అన్నారు పదేళ్ళనాడు అమలులోకి వచ్చిన రేషనింగ్ పదేళ్ళపాడుగునా అసాధారణపరిస్థితులు వున్నందువల్లనే అమలులో వున్నట్లయితే అట్టి అసాధారణపరిస్థితులు యిప్పటికి చాలామటుకు సర్దుబాటు అయినవని ప్రభుత్వం భావిస్తున్నది కనుక యిక కంట్రోళ్లు రేషనింగ్ వుండవలసిన అవసరం లేదు. ఈ విషయంలో అంతిమ నిర్ణయం పై వారంలో జరుగబోతున్నది.

ఆంధ్ర విశ్వవిద్యాలయ నాటకపరిషత్ 1951-52 నాటక పోటీలలో బహుమతి పొందిన నటుడు శ్రీ నందూరి పాండు రంగవిఠల్ (విజయవాడ కళాశాల విద్యార్థి)



(1) వేషంలో



(2) మామూలుగా

## చక్కెర రేషనింగ్ రద్దు

తక్షణమే రాష్ట్రమంతటా చక్కెర రేషనింగ్ ఎత్తివేస్తూ మద్రాసు ప్రభుత్వం మే 30 న వుత్తరువు జారీచేసింది.

అన్ని రేషన్‌షాపులలోనూ కంట్రోలు ధరలకు ప్రజలకు ఎంత మొత్తం చక్కెర కావాలంటే అంత మొత్తం యిమ్మని ప్రభుత్వం పురమాయించింది ప్రభుత్వం ఈవిధమైన నిర్ణయం చేసుకోవటానికి కారణం దేశావసరాలకు మించి మన దేశంలో యీ రోజున 4½ లక్షల టన్నుల చక్కెర నిలువవుండటమే. చక్కెర నిలువలు యింతగా పెరగటానికి కారణం మిల్లులలో చక్కెరఅధికంగా వుత్పత్తికావడం ఒకటి రెండో కారణం — మొన్న మొన్నటివరకు వీశె రు 1-11-0 వరకూ అమ్మిన బెల్లం యిప్పుడు 9 అణాలకు దొరుకుతున్నది. చక్కెర లేకపోయినా బెల్లంతో సరిపెట్టుకొనే వాళ్ళంతా బెల్లమే వాడుకొంటున్నారు. చక్కెర వాడకం తగ్గటంతో రేషన్‌షాపుల్లో కాక యితరత్రా అమ్మేచక్కెర వెల పడిపోయింది కంట్రోలు వెల వీశె రు 1-7-6 వుంటె, బయట మార్కెట్టులో రు. 1-4-0 కూడా దొరుకుతున్నది. అంతవరకూ దొరకడం లేదనుకొంటున్న చక్కెర తేలికగా దొరుకుతుండేసరికి చక్కెరతో అవసరం చాలామందికి తీరిపోయింది ఈ అన్ని కారణాలచేత దేశ అవసరా మించి 4½ లక్షల టన్నుల చక్కెర వున్నది ఈ మొత్తాన్ని వినియోగిం చేయటం ఒక స్థితికి వచ్చేసరికి సమస్య కూడా తయారుకాగలదేమో! ఎగు లకు వుపయోగించాలన్నా, విదేశా వుత్పత్తి అయ్యే చక్కెర మనచక్క కంటె చాలా చౌక.

## రాయలసీమలో పశువుల నష్టం

5 ఏళ్లుగా అనావృష్టితో అలమటిం తున్న రాయలసీమలో అతివృష్టి సంభ చింది అతివృష్టిమూలంగా క్షామపీడి వున్న రాయలసీమ రైతులు వేలాది ప లను నష్టపోయారు ఎన్నో వందల కుం బాలు నిరాశ్రయమైనాయి మునుపు వా కురవక వ్యవసాయపు పనులు కుదరక ప యిప్పుడు వానలు కురిసి కూడా పశు లేక వ్యవసాయం పనులు కొనసాగని స్థితి ఏర్పడింది ప్రభుత్వం వీలైనంతమ ట్రాక్టర్లు వుపయోగించి యీ అదన సేద్యం పనులు కొనసాగేట్లు చూడటం సరం

## పార్లమెంటు విశేషాలు

పార్లమెంటులోని సోషలిస్టుప కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ వారు క పొత్తు కలుపుకొన్నారు కాంగ్రెసే కమ్యూనిస్టేతర పక్షాలు ఏకం కావా ఆశయంతో ముందుగా యీ రెండు ప వారూ కలిశారు ఇలా కలిసినా సంఖ్యాబలం 32 మాత్రమే ఎన్ని పా ఎన్ని రకాలుగా కలిసినా పార్లమెంటు ప్రతిపక్షంగా ప్రకటింపబడటానికి లసిన కనీస సంఖ్యాబలం (50) కు రటం లేదు

వెనుకటి పార్లమెంటులో డిప్యూ స్పీకరుగా పనిచేసివున్న మాడభు అనంతశయనంఅయ్యంగారు పోటీలేకుం ఎన్నికైనారు వీరి పూర్వానుభ యిప్పటి పార్లమెంటుసభ్యులకు వుపయో పడపోతున్నందుకు హర్షించవలసి వున్న

### సవరణ

ఈ సంచిక 26 వ పేజీలో ఉన రెడ్‌ఫోర్టు ట్రేడింగ్ కంపెనీ (Re fort Trading Co) వారి నం. పోటీ ప్రకటనలో చదరం సంఖ్య ఎటు కూడినను "మొత్తం 4" అ యున్నది, "మొత్తం 46" (4 కు బదు 46) అని చదువుకొనవలెను

# ఆంధ్రరాష్ట్ర సమస్య

15 మంది పార్లమెంటుసభ్యులు మే 24 న ప్రధాని నెహ్రూవద్దకు బి. ఎస్. దత్తాగారి నాయకత్వాన రాయబారంవెళ్ళి ఐక్యకర్ణాటక రాష్ట్రస్థాపన కావాలంటూ కోరారు. వారికి నెహ్రూ యిచ్చిన సమాధానంతో ఆంధ్రరాష్ట్ర స్థాపనకోసం యిన్నేళ్ళుగా ఆందోళన చేస్తున్నవారు ఒకింత దిగ్భ్రమ చెందారు. ఐక్యకర్ణాటక రాష్ట్రసరిహద్దులు, రాష్ట్రస్థాపనాంశాలను గూర్చి సమగ్ర నివేదిక సమర్పించమని నెహ్రూ రాయబారం వచ్చినవారికి సమాధానం యిచ్చారు. ఈలాటి నివేదికలు ఇదివరకు ఆంధ్రులు ఎన్నోసార్లు సమర్పించారు. అయినా రాష్ట్రంరాలేదు. 5 ఏళ్ల వరకు కేంద్రప్రభుత్వం భాషారాష్ట్రాల విభజన విషయం తలపెట్టలేదని విస్పష్టంగా వెనుక చెప్పివున్న నెహ్రూగారు ఇప్పుడు కర్ణాటకులను సమగ్రనివేదిక సమర్పించుకోమనటం సమర్థనీయంగాలేదు. కర్ణాటకులు తయారుచేసే నివేదికమూలంగా యిరుగు పొరుగు రాష్ట్రాలవారితో వారికి కొన్ని అభిప్రాయభేదాలు తలెత్తటం తప్పించి యీ నివేదికవల్ల వారికి రాష్ట్రంమాత్రం రాబోదు.

ఢిల్లీలోని ఆంధ్రులు తమకు చేసిన సన్మానసందర్భంలో భారత వుపాధ్యక్షుడు డా॥ సర్వేపల్లి రాధాకృష్ణగారు ప్రసంగిస్తూ ఆంధ్రాభిమానం, ఆంధ్ర రాష్ట్ర వాంఛవున్నంతమాత్రాన భారతదేశ ఐక్యతకు ఎటువంటి అంతరాయమూ రాదని చెప్పివేశారు.



హంద్రానదిలో వచ్చిన వరదలు మూలంగా కర్నూలు పరిసరాలన్నీ జలమయమైనాయి.

## రైల్వేలో అదనపు సౌకర్యాలు

ప్రయాణీకుల రద్దీ ఎక్కువగా వుండే చోట్ల డీసెల్ రైళ్లు నడపాలనే వుద్దేశం వున్నదని కేంద్రరైల్వేశాఖమంత్రి కౌన్సిల్ ఆఫ్ స్టేట్స్‌లో ప్రకటించారు. దూరప్రయాణాలుచేసేవారి సౌకర్యార్థం మెయిలు, ఎక్స్‌ప్రెస్ వంటి రైళ్లను యిప్పటి మాదిరిగా గంటకు 25 మైళ్ళ చొప్పున కాక 40 మైళ్ల వేగంతో నడిపించే ఆలోచన వున్నదని కూడా మంత్రిగారు చెప్పారు. మూడవ తరగతి రైల్వే ప్రయాణీకుల అసౌకర్యాలను గుర్తించి, వాటిని తొలగించేందుకు కేంద్రప్రభుత్వం ఆలోచనలు చేస్తున్నందుకు వారిని అభినందించవలసివున్నది. ★



డా॥ రాధాకృష్ణన్‌గారు వుపన్యసిస్తున్నప్పుడు తీసిన చిత్రం.

# ఇంతకీ నేను చేసిన పొరపాటు ఏమిటి?

మా వారికి ఈవూరు 'ట్రాన్స్‌ఫర్' అయి నెలరోజులే అయింది. నాకు ఎవరూ ఇంకా స్నేహితం కాలేదు. నలుగురి ఇళ్ళకూ వెళ్లి నలుగుర్నీ పరిచయం చేసుకుందామన్న తాపత్రయం కూడా నా కంతగా లేదు అందరిలాగా ఎక్కువగా మాట్లాడ్డం గప్పాలుకొట్టి వాళ్ళ పుట్టుపూర్వోత్తరాలన్నీ ఎక్కతీయడం నాకు మొదటనుండీ అలవాటూ లేదు. ఇష్టమూ లేదు ఏదో ఇంటికివచ్చినవారికి మర్యాద చేసిపంపుతానే కాని, వారితో పకపకలూ, చెకచెకలూ, హాస్యాలూ నాకు చిరాకు. ఏదో 'లోకో భిన్నరుచిః' అంటారు ఎవరి వెర్రి వారి కానందము! అలాగ లేకపోతే ఈ ప్రపంచయాత్ర నడవటం కష్టంగదా!

మా పెళ్ళయి ఏడెనిమిదేళ్లయినా దేముని దయవలన 'ప్రోగ్రెస్' మాత్రం అధికంగా లేదు మాకు చిట్టిఒక్కతే సంతానం దానికి మూడేళ్లు నిండాయి దాని ఆటపాటలతో నాకు ఎంతపొద్దూ చాలదు ఆ ఈడు పిల్లలు ఆ విధంగా ఆటలాడ్డం నే నెక్కడా చూడలేదు.

"నేను సర్క్యూటుకు వెళ్లితే నీ కెట్లా పొద్దు పోతుంది? నలుగురి ఇళ్ళకువెళ్లి ఎవర్నీ స్నేహితం చేసుకోవుగా?" అని వారు ఎప్పుడూ అంటారు

"వాళ్ళభాష నాకు రాదు నాభాష వారికి రాదు. ఎక్కడకు వెళ్లడం?" అని నేను జబాబుచెప్తూంటాను ఇంతకీ మూలం పొద్దుపోదన్న చింత నాకు లేదుగా మరి! ప్రొద్దున్నే లేవడం కాల్యాదులు తీర్చుకోవడం స్నానం చేసి మా వారు లేచేసరికి వారికిష్టమైన దేదో ఇంత కాఫీ టిఫన్ తయారుచేసిచ్చి, ఆయన ఆఫీసుకు దయచేయగానే ఇల్లు నాలుగు మూలలూ సవరిస్తాను. అటుపై చప్రాసీవాడి చేత దగ్గరుండి బల్లలు కుర్చీలు తుడిపించి 'ఫ్లవర్"వాసులో పూవులు సర్దిపెట్టడం మామూలు ఆ తరువాత చిట్టికి స్నానం చేయించీ ఆవిడగారు ఎంచి ఎంచి ఇచ్చిన బట్టలు తొడిగి, జడవేశి, అభీష్ట అలంకారం పూర్తిచేశి ఆడుకోమని ఆవిడబొమ్మలగది లోకి దానిని పంపి వంటచేయడం ఆరంభిస్తాను రొట్టెలతో సహా ఆపని పూర్తి చేసుకుని మావారికి కేరియరు నింపి ఆఫీసుకు పంపి మాచిట్టిపెట్టిన పేచీలన్నింటికీ సమాధానం చెప్పి దానికి అన్నం తినిపించేసరికి టంగున ఒంటిగంట కొట్టుతారు తరువాత నేను భోజనం చేసుకుని చక్కపెట్టుకు వచ్చేసరికి పేపరు వస్తుంది అది ఒకమారు తిరగేశి చిట్టిని పక్కలో పెట్టుకుని ఒక్కకునుకు తీసిలేచేవరకు మూడు గంటలూ కొట్టుతారు స్టౌ వెలిగించి ఏదో వక ఫలహారం టీ చేసే వరకూ మావారి

శ్రీమతి శిరుగూరు రత్నమ్మ

జోడుచప్పుడు వినబడుతుంది. టీ ఫలహారాదులు ముగించుకుని ఆయన క్లబ్బుకు అటూ వెళ్లగానే దొడ్లో పూసినపూవులు చప్రాసీ తెచ్చిస్తే అవన్నీ దండలుకట్టి చిట్టికి కొన్ని పెట్టి మిగతావి నేను పెట్టుకుని చిట్టిని ఆలాగ బైటకుతీసుకెళ్లమని చెప్పి షికారుకు పంపుతాను. అప్పుడుఒక గంటసేపు తీరుబడిగావుంటుంది ఆ టైములో ఏదో ఒక కుట్టుపనివుంటుంది మావారి కర్చీఫులో, లేకపోతే షర్టలకుగుండీలు కుట్టడమే ఏదోవక పనిచేస్తుంటాను ఇంతలో పొద్దు మాటువాలుతుంది మళ్లీ రాత్రి వంటలో పడతాను. ఈ మాయదేశంలో బియ్యం మంచివి దొరకవు అందునించి రెండుపూటలా తప్పని సరిగా రొట్టెలు చేయవలసినదే. పోనీ చప్రాసీలకు బోధపరచి చెప్పుదామంటే మరాఠీగాని, ఉర్దూగాని నాకు రాదు. వాళ్లకు తెనుగు రాదు ఈ మరాఠీదేశానికి మావార్ని ట్రాన్సఫరుచేశారు నానా అవస్థగాను వున్నది సౌంజ్ఞలతో ఎన్నాళ్లు పనులు జరిపించుకోవడమో తెలియకుండావుంది.

ఇందునించి ఒకరింటికి వెళ్లితే నేగాని పొద్దుపోదన్న బాధ నాకు లేదు.

ఒకనాడు ఇదే విధంగా పనులన్నీ ముగించుకుని మావారిరాకకోసరం నిరీక్షిస్తూ వాకిట్లో వేశిన కుర్చీలో కూర్చున్నాను

ఆనాడు పౌర్ణమి అవడంచేత వెన్నెల పిండారపోశినట్లుంది. నాతలలో పెట్టుకున్న మల్లెపూలు వాసనలు వెదజిమ్ముతూ



న్నాయి ఆ పుచ్చపూవులా వున్న వెన్నెల్లో కూర్చుంటే మనసులో ఏవేవో తియ్యని ఆలోచనలు పుట్టుతూన్నాయి చిన్నతనంలో చేసిన కొంటెపనులు, చిలిపిచేష్టలు, అటుపైని పెండ్లయినక్రొత్తలో గడిపిన మధురాతిమధురమైన రాత్రులు అన్నీ మధురస్వప్నాలుమాదిరిగా, చిరుమబ్బు తెరలుగా మనసులో తిరుగుతూన్నాయి ఇంతలో చప్రాసీ వచ్చి "అమ్మాజీ! సాబ్ సినిమా గయ్ మకాన్ మే బోలోబోలా," అని చెప్పాడు.

'సరే ఇంకేముంది ఈయనకు పని' అని కొంచెం విసుగ్గా లోపలికి లేచివెళ్లి చిట్టికి అన్నం తినిపించి "ఆడుకో అమ్మా" అని దానిముందు ఇన్ని బొమ్మలుపెట్టి చప్రాసీని చూస్తూండమని చెప్పాను, వాచీకేసి చూస్తే ఎనిమిదిగంట లయింది



'సరే ఆయన రావడానికి ఎంతలేదన్నా రెండుగంటలు పైముందికదా; ఎంతోమంది నాభోటివారు పత్రికలకు కథలు వ్రాస్తారు. నేనుమాత్రం ఎందుకు వ్రాయకూడదూ ఏదైనా చిన్న కథానిక వ్రాసి పంపుదాము' అని అనుకుని సాహిత్యసేవకు మొదలుపెట్టాను ముందుగా వర్జ్యం లేదుగదా అని కేలెండరు చూచివచ్చాను. రాహుకాలంగాని, వర్జ్యంగాని ఏమీలేదు. పావుతావుసైజున కాగితం ఫర్రుమని చింపి మావారి కోటుజేబులో వున్న ఫౌంటను పెన్ను తీసుకువచ్చాను ముందుగా కథకు పేరుపెట్టడమా? లేక కథ వ్రాసినతరువాత కథ ననుసరించి పేరు పెట్టడమా? నిర్ధారణ కాలేదు 'సరే' మొదట కథ మొదలుపెట్టితే తర్వాత పేరుమాట చూడొచ్చని వ్రాయడానికి మొదలెట్టా. మావారు ఆ పెన్నుతో ఏలాగు వ్రాస్తారో కాని నేను వ్రాయబోయేసరికి అది నాకెదురుతిరిగింది అంతటితో దాన్ని యథాస్థానంలో పెట్టి కలం సిరాబుడ్డీ తెచ్చుకున్నా. తీరా సిరాబుడ్డీ మూత తీసి చూద్దునుగదా దానినిండా ఇసుక పోసి వుంది ఇది చిట్టిపనే అయివుంటుందనుకుని అది పెట్టేసి పెన్సిలుకోసరం వెదికా. వెదగ్గా వెదగ్గా అది దొరికింది చూస్తే దానికి ముల్లులేదు. మా చిట్టి మధ్యాహ్నం ఆ పెన్సిలుతో అమ్మ, నాన్న బొమ్మలు వేసిందని జ్ఞాపకంవచ్చి షెల్ఫులోవున్న పాత బ్లేడుతో పెన్సిలు చెక్కుకుని నా కథ నిర్విఘ్నంగా పూర్తికావాలనీ పత్రికాసంపాదకులు నా కథానికను త్రిప్పేయకుండా తప్పక ప్రచురించాలనీ మనస్సులో విఘ్నేశ్వరుని ధ్యానించి నమస్కారం చేసి తూర్పుదిక్కుగా కూర్చుని కథ వ్రాయడం ప్రారంభించా. ముఖ్యంగా మూడు పంక్తులు వ్రాశానో లేదో ఇంతలో కొంపమునిగేటట్టు ఏడుస్తూ "అమ్మ బజ్జుందాము దావే" అంటూ పరుగెట్టు కొచ్చింది చిట్టి దానితో "నీవు వెళ్ళి పడుకోరాదూ?" అని, చప్రాసీతో "మీ కెప్పుడూ ఇంతే, నే నేదయినా పనిచేసుకుంటూంటే పిల్లను వదిలిపెట్టవద్దని లక్షసార్లు చెప్పాను. మీకు ఎన్నిసార్లు చెప్పినా ఇంతే" అని వచ్చీరాని ఉర్దూలో కసురుకున్నాను.

'మైక్యా కరూం అమ్మాజీ మై బోలేతో బేబీజీ నై సున్‌లీ' అన్నాడు తురక చప్రాసీ సరేలే నా మొహంలాగే వుంది నా కథ అని విసుక్కుని ఇంకేలాగూ చిట్టి వూరుకోదుగదా అని ఎత్తుకోబోయా!

(48-వ పేజీ చూడండి)

# అదృష్టకవచం

అదృష్టం పాత్రిళ్ళలో పెరిగిన భారతీయుడికి కనబడేదంతా వేదాంతం, నిస్పృహ, వైరాగ్యం. సాంఘిక జీవితం, మర్యాదలు, పరిసరాల ఒత్తిడి, అనే తిరుగళ్ళ మధ్యన చూర్ణం కావడమే ఆర్థిక వ్యవస్థ నిత్యపరిణామం. దాని ప్రతిఫలమే గడచే ఒక్కొక్క రోజుకు అడుగడుగున అన్ని హంసపాదులు

అబ్బాయి స్కూలుఫైనలు పరీక్షాఫలితాలు ప్రకటించిన వార్తా పత్రిక తీసుకొచ్చి 'నాన్నా! నేను ప్యాసైనా ఇదిగో! రెండో తరగతిలో' అని తన నెంబరు చూపిస్తూ కుర్చీ ప్రక్కన నిల్చున్నాడు. పత్రికలో అబ్బాయి నెంబరు చూచాను.

ఫైనలు పరీక్షతో సమీపంలో ఉన్న పాఠశాల విద్య సమాప్తమైపోయింది. పై చదువుకు పట్నంపోవాలి.

పరీక్షాఫలితాలు తెలిశాయి. ఉన్నత విద్య కావాలని అనర్ఘ విద్యాసంస్థలో, విద్యాతృష్ణ తీర్చుకోవాలనే ప్రబలమైన కాంక్ష మొదటినుండీ లోపల పీడిస్తూ ఉండేది. భగీరథ ప్రయత్నంతో నలభై రూపాయలు సంపాదించుకొని పట్నం బయలుదేరి కాలేజీలో ప్రవేశ సమయం (అడ్మిషన్ తేది) లో దరకాస్తు పెట్టా. చేరాలనే ఉబలాటంతో కళాశాలాధికారుల నర్థించా. నా ప్రార్థనలన్నీ సముద్రం మీది వర్షంలా నిష్ఫలమైనాయి. చేతిలో ఉన్న ఆకష్టార్జితపు రూకలు

శ్రీ పైడిమర్రి వేంకటసుబ్బారావు

'ఔను! రెండవ తరగతి!' అని ఇంకా వేరేశబ్దాలు రాకుండానే, ఆలోచనా తరంగాలలో లీనమైన భావాలతో, నాభౌతిక వ్యాపారం స్తంభించిపోయింది.

'నాన్నా! పైక్లాసు చదివించవూ!' ఈమాటలు కశాఘాతంలా తగిలి భావ పరంపరల్ని మరింత వేగంగా పరుగెత్తించినవి.

మానాన్న చనిపోయిన ఆ కొత్త రోజుల్లో, ఎవరూ వెళ్ళవేసే మగదక్షత లేని సంసారాన్ని, అమ్మ ఒక్కతే నడుపుతూ ఉండేది అప్పుసప్పులు లేని సంసారాలు యే కొన్ని ఉన్నాయో గాని మనలాటి సామాన్య గృహస్థులకు అప్పు నిత్యం చేసే ఒకతప్పు అదే ఒక ముప్పు వడ్డీకి వడిసుత్రాలు చాలవు పెరిగి పెరిగి ఆఖంతలు కొండంతలైన అప్పు పత్రాలు చెల్లువేస్తూ లేమిడి కాపురంతో కష్టమయ జీవితాన్ని గడుపుతున్న సమయం ఏకైక పుత్రుణ్ణి అయితేనేం? సంపన్నులైతేనేగదా ఏకపుత్ర విషయంలో సుఖం కలిగేది. విత్తం కొద్దీగదా వైభవం ఒక ప్రక్కన బడిలో చదువుకుంటూ, తీరిన సమయంలో ప్రైవేటుట్యూషన్లు చెప్పుకుంటూ, కష్టంగా వెళ్ళే బస్తీకాపురానికి, ఆ వచ్చే పది, అయిదులతో సాయపడుతూ ఉండేవాణ్ణి. స్కూలు

పట్నంలో అటూ ఇటూ తిరగటంలో కర్చైపోతూ ఉన్నై. కులకక్షల పెనుభూతాలు విద్యా సంస్థలలో కూడా చేరినై విద్యార్థి జీవితాన్ని కూడా కబళించడానికి ప్రత్యక్షమైనాయి అంతటితో ఉపయోగంలేని ప్రయత్నాన్ని మానుకొని యిల్లు చేరుకున్నా. "చదివిన చదువు చాలులే ఇంకా యెంత కాలం? మీ అమ్మను ఇంకా శ్రమ పెడతావా? ఏదైనా ఉద్యోగం చేసి కుటుంబాన్ని పోషించు," అనే మాటలు ప్రతివైపునుండి వినపస్తూ ఉన్నాయి ఓ పక్కన చెప్పలేని అమ్మయొక్క కరుణామయమైన ఆక్రోశన. రెండోపక్కన నా చదువు మధ్యలో ఆగిపోతున్నదనే బాధ. దిక్కులేని కాపురంతో ముందు చదివితేమాత్రం యేలాగ అనే ఆలోచన. ఇవన్నీ నా మెదడును కలచివేశాయి. మానవుడికి జన్మహక్కుగా ఉన్న విద్యకూడా లభించడానికి యిన్ని విధాలైన అడ్డంకులు తీరని ఆ వేదనతో, వృద్ధి పొందుతూఉన్న విద్యా పిపాస నిరాధారంగా పోఖలసిందేకదా! విద్యకు ధనానికి సంబంధం లేదని వాదిస్తారు, విద్యముందర ధనం లెక్కలేదంటారు. విద్యకు కూడా ఈ రోజులలో ధనం అవసరమైనదని చెప్పక తప్పదు. ధనము లేనివాడు చదవడానికి కూడా అర్హుడు కాడు. తుదకు జీవించడానికి కూడా తగడేమో? ప్రారబ్ధంకర్మ ఇవే కారణాలేమో ఈ ఉచ్చనీచ దశలకు? సంపన్నత్వానికి, బీదతనానికి? చివరి శరణ్యం వేదాంతం-అదృష్టం-వైరాగ్యం-తృప్తి-ఇవే అభేద్య కవచాలు. ఇవే ఆలోచనలు-ఎల్లాగైతేనేం, కళాశాల విద్యకు ఇంతటితో స్వస్తి చెప్పక తప్పిందికాదు

తరువాత కార్యక్రమం-ఒక గుమాస్తా ఉద్యోగం-ఎందూ గతిలేనివాడు చేసేదేం! జీవన్మృతావస్థలో ఉన్న మా బోంట్లు, ధన ప్రభావ పూరితమైన ఈ ప్రపంచంలో, ఆత్మగౌరవం, మానసిక స్వాతంత్ర్యం, విద్యాకృషి, అనే విషయాలకు యెప్పుడో తిలాంజలి యిచ్చి, ప్రోడు బారిన గుండెతో, కుర్చీ బల్లలమధ్యన పడి, రాత్రింబవళ్లు, కవిలెకట్టలలో మునిగి తేలుతూ ఉండక చేసేదేం? ప్రొద్దునే నిద్దుర లేస్తూనే కావలసింది డబ్బు. సరిగా నెలగడచే సరికి ఒకటో తారీఖున వస్తాయని ఆశించిన నాల్గుడబ్బులు రావడంలో రెండురోజులు ఆలస్యమైతే సరి అప్పులవాళ్ల పటాలం యింటిమీద ఫిరంగులు కురిపిస్తారు. పైకి పటారం లోపలలొటారం. పది ఉన్నా లేకున్నా పైకి మాత్రం ముఖంలో గాంభీర్యం పెట్టుకొని తిరుగకపోతే తప్పదు లోంపలో జరిగే ఆర్థిక సంబంధమైన యిబ్బందులను దిగమ్రింగాలి బంధు మిత్రాదుల వివాదలను, ఇతర వైరాశ్యాలను జీర్ణించుకోవాలి. కచ్చేరీలో అధికారులు అప్పుడప్పుడు వడ్డించే మంగళ

(47-వ పేజీ చూడండి)

సంచేరన్న కృతజ్ఞతలేకుండా ఇంట్లోనే దొంగతనాలు"

"పోనీలే ప్రభా. పుణ్యానా పాపానా భగవంతుడికెరుక, పోయి పడుకుం టాను వెళ్ళు"

ప్రభ వెళ్ళిపోయాక వెంకట్రావు ఆలో చనలో పడ్డాడు. ప్రభ చెప్పినదానిలో చాలా తక్కువ నిజముండాలి ఊళ్ళో చాలామంది ప్రభ కుటుంబానికీ, సాగ రాజుకుటుంబానికీగల వైరుధ్యానికి కారణా లనేకాలుగా చెప్పుకుంటూంటారు. సాగరాజు తల్లిని యౌవనంలో ప్రభ తండ్రి జానకిరామయ్య వలలో వేసుకో జూచాడనీ, ఆమె ఆ పని సాగనియ్యక భర్తతో చెప్పి అతన్ని తన్నించిందనీ ఒక కథనం. ఏది ఏమైనా, ప్రభ కుటుంబాని కంతటికీ, తన కుటుంబంలో చివరికి మిగి లిన సాగరాజుమీద చాలా కోపం ఉందన్న సంగతిమాత్రం నిర్ధారణ అయింది.

ఉదయంలేచి ముఖం కడుక్కుం టూంటే గోడ అవతల, సాగరాజింట్లోంచి ఏదో స్త్రీకంఠం తిడుతూ వినిపించింది వెంకటరావు ఆ వైపుకి చూశాడు. సాగ రాజుని వాళ్ళ అత్త తిడుతోంది.

"సిగ్గులేని వెధవా...ఆ రూపాయి నువ్వ కాక ఇంకెవరు తీస్తారు? వాడికి బూట్సు కొందామని ఇందాకా ఒక రూపాయి ఉంచాను. అప్పుడే నీకళ్ళు పడ్డాయీ? ఎక్కడ దాపురించావురా?"



సాగరాజు దీనంగా, "నేను తియ్యలే దత్తా. నా కెందుకు? నిజంగా నే నెర గను" అన్నాడు

ఆ మాటలు పూర్తి అయేసరికి వాడి వీంత మీద ఆమె వ్రేళ్ళు దిగుతున్నాయి వెంకట రావు గుండెలు జివ్వుమన్నాయి ఇంక చూడలేక కష్టంగా వెనుదిరిగాడు ప్రభ కాఫీకప్పుతో సిద్ధం అయింది అతను ముఖం తొందరగా కడుక్కోవడం ముగించి కాఫీ తీసుకున్నాడు.

"నేనే వద్దనే...నువ్వెందుకు తెచ్చావు ప్రభా?"

"ఏం, తేకూడదా?"

"ఎందుకూడదు? కాని, అనవసరంగా శ్రమ ఇవ్వడం ఎందుకని – తరవాత ఎలాగూ తప్పదుగా?"

ప్రభ తొందరగా కప్పు తీసుకుని క్రిందికి పరిగెట్టింది ప్రయత్నించినా వెంకట రావు చేతులకి దొరకకుండా.

* * *

సాయంకాలం వెంకటరావూ, శ్రీపతీ హోటల్కి పోయారు కాఫీ తాగుదామని. ఒక మూల కూర్చున్నాక శ్రీపతి, ఎవరూ సర్వ్ చెయ్యడానికి రాకపోవడం చూసి, "ఒరే సాగరాజూ!" అని పిలిచాడు.

సాగరాజే అక్కడ ఉంటాడు. వచ్చాడు. పద్నాలుగేళ్ళుంటాయి. దైన్యముఖపర్చుస్తున్న దరిద్రాన్ని సూచించినా మాలిన్యాన్ని సూచించని బట్టలు. వెంకటరావుకి చాలా కష్టం అనిపించింది వాడి పరిస్థితికి. ఉదయం ఇంటిదగ్గర జరిగిన కథకి వాడికళ్ళు సాక్ష్యం చెప్తున్నాయి.

"ఇడ్లీ తీసుకునివచ్చి రెండు పెసరట్లు చెప్పరా" అన్నాడు శ్రీపతి. అధికార యుక్తంగా ఆ మాట లతనంటూంటే వెంక టరావు కళ్ళల్లో కనిపించిన అసహ్యాన్ని సాగరాజుమాత్రం చూశాడు.

శ్రీపతి 'ఆర్డర్' తీసుకుని, సాగరాజు వెళ్ళిపోయాడు. ఇంకా వెంకటరావు అలానే పరధ్యానంతో ఉండడం చూసి, శ్రీపతి "ఏమిటి బావా, ఆలోచిస్తు న్నావు?" అన్నాడు.

వెంకటరావు కొంచెం తేరుకుని, "ఈ హోటళ్ళో పరిశుభ్రత అంటే ఏమిటో తెలుస్తా అని ఆలోచిస్తున్నాను...అలాటి చోట సర్వర్ గా ఉండడం ఇంకా ఎంత అసహ్యకరమూ అని?" అన్నాడు,

శ్రీపతి నవ్వి, "మనకెక్కడ అంతా స్పెషల్లే...సర్వర్ది కూడా ఒక ఉద్యోగమే కాదూ? వీడిబాబు చాలా మట్టుకు అందరిదగ్గరా కొట్టేసి తాగేసి వీడిని లోకంమీద వదిలేశాడు. అదంతా ఒక కథలే"

వెయిటర్ నాగరాజు ఇడ్లీ తెచ్చాడు. ఇద్దరూ తింటున్నారు. వెంకటరావు మాత్రం చాలా ఆలోచనలతో బాధపడుతున్నాడు. నాగరాజుని ప్రత్యక్షంగా చూశాక గతరాత్రి వాడు వినిపించిన సుందరమురళీనాద తరంగాలు మళ్లా జ్ఞప్తికి వస్తున్నాయి. మాణిక్యం బొగ్గుల్లో పడిఉండే లాగ, నాగరాజు పరిస్థితి అతనిని బాధిస్తూన్నది.

పెసరట్లు వచ్చాయి. సరిగ్గా కాల్చలేదని వెయిటర్ ని తిట్టాడు శ్రీపతి. నాగరాజు మాటలాడలేదు; వెంకటరావుకి మాత్రం శ్రీపతిమీద కోపం అంచులకి ఎగబ్రాకుతోంది.

కాని, కాఫీ వచ్చాక, కప్పులో చిన్న చీమ కనిపించేసరికి శ్రీపతికి కోపం ఆగలేదు. కోపంగా "వెయిటర్" అని పిలచాడు.

"బాబూ!"

"ఇదేమిట్రా?"

"పంచదారలోనిది కాబోలు...ఇంకొకటి తెస్తాను"

"స్టుపిడ్...కళ్లు కనపడలేదూ?"

"నేనేంచేసేదండీ? కాఫీ కలిపేవారినడగాలి"

"వెధవ, సమాధానం చెప్తావ్! మ్యానేజర్!"

గట్టిగా కేకవేశాడు...మేనేజరు వచ్చాడు.

"ఏమండీ ఈకాఫీ చూశారా? ఏమిటని అడిగితే కాఫీ కలిపినవాడి నడగమంటాడు. వెయిటర్ కే ఇంత గర్వమా?"

నాగరాజు వణుకుతున్నాడు.

"ఏమిరా? ఏందిరా యిది?"

"నేను చూడలేదు సార్."

"ఏమిరా? కళ్లులేవా? పైగా, సమాధానం చెప్తావా? ఇడియట్"

నాగరాజు కళ్ళల్లో నీరు తిరిగింది. మేనేజరు వాడి చొక్కా కాలరు పట్టుకున్నాడు.

బలంగా గింజుకుంటూ నాగరాజు "వదలండి" అన్నాడు. అందరూ తెల్లబోయారు.

కాని, మేనేజర్ అధికారమూ, శ్రీపతి స్వోత్కర్షా దెబ్బతిన్నాయి.

"ఏమిరా?" అన్నాడు కోపంగా మ్యానేజరు.

"నాకు ఉద్యోగం అక్కరలేదు" అన్నాడు నాగరాజు, బిల్లుపుస్తకమూ పెన్సిలూ టేబిల్ మీద పడేస్తూ.

మానేజర్ కోపంతో వణికిపోతున్నాడు. "నీ మామకి ఒకనెల జీతం అడ్వాన్సు ఇచ్చి ఉండగా" ఏమి చెప్తావు? దెబ్బలు తినేదానికి" అన్నాడు.

నాగరాజు తెల్లబోయాడు...మానేజర్ అనువు చూసి ఒకటి అంటించాడు.

అప్పటిదాకా కూర్చుని ఇదంతా సంబంధం లేనట్లు చూస్తూన్న వెంకట్రావుకి ఒక్కసారి కోపం వచ్చింది.

"ఆగు...మళ్ళావాడి వంటిమీద చెయ్యి పడితే జాగ్రత్త" అని కేకవేసి, వెళ్లి నాగరాజుని విడిపించి వాడికీ మ్యానేజరుకీ మధ్యన నిలబడ్డాడు. ఉన్నతమైన అతని ఆకృతిచూసి, మేనేజరు కొంచెం తగ్గాడు.

ఇంతలో శ్రీపతి కలుగజేసుకుని," వదిలేయ్ బావా...వాడిపొగరుకి తగలాల్సిందే. మనకెందుకు?" అన్నాడు.

"అదేమిటోయ్? వెయిటరైతేమాత్రం అంత నీచంగా చెయ్యి చేసుకుంటాడా? అసలు కాఫీలో 'ఈగ' ఉంచే పూచీ ఎవరిది?"

శ్రీపతి చిన్నబుచ్చుకున్నాడు. తనమీద బావ అంత నిందవేశాడు. అతనికి చాలాకోపం వచ్చింది.

"వీడి మామ నాకు వీడిని ఒప్పగించేడు సార్...వీడి కథడుసార్ తిండిపెట్టేది? ఎక్కడికిరా నువ్వుపోయేది?"

నాగరాజు తలదించుకున్నాడు. పోనూ-వాడెక్కడికి పోతాడు?

"ఎక్కడికీ పోను సార్" అన్నాడు.

"వెధవ" అన్నాడు శ్రీపతి తాను తిన్న దెబ్బతీవ్రతని సూచిస్తూ.

"వీడి మామకెంత ఇచ్చావు అడ్వాన్సు?" అన్నాడు వెంకటరావు మ్యానేజర్ వైపు తిరిగి.

"ఒక నెల జీతం సార్...పదిహేను రూపాయలు."

వెంకటరావు పర్సుతీసి నోట్లు తీస్తూంటే తెల్లబోయి శ్రీపతి, "ఏమిటది బావా?" అన్నాడు.

"చూస్తావుగా?" అని, పదిహేను రూపాయలు మేనేజర్ చేతిలో పెట్టి, నాగరాజుకేసి తిరిగి, "పద" అన్నాడు.

"ఎక్కడికి సార్?" అన్నాడు నాగరాజు.

"నా ఇంటికే..."

"మా మామ తంతాడు సార్."

"నేనున్నాగా...భయంలేదులే..."

ఆ మాటలు అమృతంగా పనిచేశాయి... నాగరాజు కళ్లు తుడుచుకుని బయలుదేరాడు.

గుమ్మం దాటాక, శ్రీపతి "ఎక్కడికి తీసికెళ్తావ్?" అన్నాడు మహాశ్చర్యంతో.

"ఇంటికి."

"వీడు గుమ్మం ఎక్కితే నాన్న వప్పుకోరు."

"నాకు తెల్సును."

వెంకట్రావు ఇంటికి వెళ్ళకుండా, రైలు స్టేషన్ కి దారితీశాడు...శ్రీపతి మాటలు నిష్ఫలమయ్యాయి.

"నువ్వు చేస్తున్నపని ఎంత ప్రమాదిస్తుందో తెలుసా?" అన్నాడు చివరకి శ్రీపతి,

"ఇందులో తప్పేమి ఉన్నదని నా

ఉద్దేశం కాదు. నా దృష్టికి ముఖ్యమైనవి వాడికి వచ్చిన సంగీతమూ, వాడు పొందుతూన్న కష్టాలూను. ఏదో తినడానికి భగవంతు డిచ్చాడు. సాధ్యమైనంతవరకూ వీడిని పండితుడిని చెయ్యడానికి నా శక్తి వినియోగిస్తాను...మీ కందరికీ వాడిమీద కోపం కావచ్చు. కాని నా అంతరంగాన్ని చంపి నేను వాడికి ద్రోహం చేయలేను."

"కాని— ప్రభ ఏమంటుందో ఆలోచించావా? నాన్నకి నీ విషయంలో ఉన్న ఉద్దేశం మారవచ్చు కూడా."

"నీ ఉద్దేశం నాకు తెల్సు... ప్రభ విశాలభావాలనీ, అవసరమైన జాలినీ, దయాధర్మాలనీ పరిత్యజించదలచుకొంటే నన్నూ పరిత్యజిస్తుంది. చదువుకుంది—తన భావాలు తన కున్నాయి.—ఏమైనా, నేను విషయమంతా రాస్తాన్లే ఆమెకి...టైమైంది... వస్తాను. బట్టలకీ, సూట్‌కేస్‌కీ మనిషిని పంపుతా."

ఈ మాటలు అనేసి, వెంకటరావు నాగరాజు భుజంమీద చెయ్యివేసి రైలుస్టేషన్ దగ్గరికి దారితీశాడు. రైలు అప్పటికే ప్లాట్‌ఫారమ్‌మీద ఉంది. తొందరగా రెండు టిక్కట్లుతీసి వెంకటరావు రైలెక్కాడు—తన కొత్త బరువుతో సహా.

గుమ్మందగ్గర నిలబడి నాగరాజు ఊరు కేసి చూస్తున్నాడు...వెంకటరావు వాడిని వెనకనించి పరిశీలిస్తున్నాడు. రైలుస్టేషన్ దాటి, ఊరుని దృక్పథం దాటించాక నాగరాజు వెనుదిరిగి, వెంకటరావు ప్రక్కన కూర్చున్నాడు.

కొంచెంసేపు ఎవరూ మాటలాడలేదు. బహుశా ఆనాటి అనుకోని సంఘటనలని గురించి ఇద్దరూ ఇంకా ఆశ్చర్యంతో ఆలోచిస్తున్నారు.

ఇంతలో నాగరాజు ఒక్కసారి వెంకటరావు వైపుతిరిగి, "నా మూలంగా మీరు వారితో దెబ్బలాడారు—ఏదో నా బ్రతుకు బ్రతకలేనని తొందరపడి" అన్నాడు.

వాడి సంభాషణలో నాగరికతనిచూసి వెంకటరావు మొదట కొంచెం ఆశ్చర్యపడ్డాడు..."లేదులే. అసలు సంగతేమిటంటే, నిన్నరాత్రి నీ మురళివాద్యం విన్నాక నువ్వంటే నాకు చాలా అభిమానం ఏర్పడింది—నీ పరిస్థితులలో నువ్వు చాలాఅభివృద్ధి పొందడం అసంభవం; కనక నామానవత్వం నన్ను ప్రేరేపించి, నిన్ను నాతో తీసుకుపోతున్నాను. నాకూ తమ్ముళ్లెవరూ లేరులే" అన్నాడు.

ఆ చివరిమాటలు నాగరాజు మనస్సులో వారిద్దరికీ ఉన్నదూరాన్ని చాలా తగ్గించాయి. నాగరాజు ఒక్కసారి అతనివైపు చూశాడు.

వాళ్ళు తమ గమ్యస్థానం చేరేసరికి, తాము వివిధకుటుంబీకులమనే విషయాన్ని మఱచిపోయారు.

* * *

అక్కడినించీ నాగరాజంటే వెంకట్రావుకి అభిమానం దినదినమూ అభివృద్ధిపొందుతోంది. మొదట ఊళ్ళో ఉన్న సంగీత విద్వాంసుడిచేత శాస్త్రసంగీతం చెప్పించాడు. స్వరజతులై, "శ్రీ గణనాథ — సిందూరావర్ణ" అని నాగరాజు మురళిమీద

పాడుతోంటే అతను తనని తాను మరచి ఆనందించాడు. ఆ చిన్ని పాటలలోనే అతని మురళి వెంకట్రావుకి ఏదో అపూర్వ సంగీతాన్ని అందించేది.

ఒకరోజు సాయంత్రం...అదే హాలులో కూర్చుని సాగరాజు ఏదో గీతం మాస్టరు చెప్పినది సాధకం చేస్తున్నాడు. అప్పటికి వాడు హోటల్ వదిలిపెట్టి రెండుమాసాలవలేదు పూర్తిగా.

అప్పుడే పోస్ట్‌మాన్ ఉత్తరాలు తెచ్చి పడవేశాడు...ఒక దస్తూరీ అతను త్వరగా గుర్తుపట్టాడు ప్రభదని. చించి చదివాడు.

"బావా!

ఈ రెండు నెలలూ నువ్వు ఉత్తరం రాస్తావని నమ్మకుని కూర్చున్నాను. కాని, అంతటి అదృష్టం కలగలేదు. అందుకని, నేనే ఈనాడు నీకు రాస్తున్నాను.

అన్నయ్య అంతా చెప్పాడు. వాడు తొందరపడి ఏదో అంటేమాత్రం, అంతమాత్రానికే ఒక్కసారికనపడకుండా ఇంటికి వెళ్ళిపోవాలా? నాన్న ఎంత బాధపడ్డారంటావు? నాకేడుపు వచ్చిందిభావా నిర్దయతో నువ్వు చేసినపనికి.

నువ్వంత తొందరపడతావని నేనెన్నడూ అనుకోలేదు. సాగరాజంటే నీకు అవ్యాజంగా అభిమానం కలిగిఉండవచ్చు. కాని, నాకన్నా నీకు వాడెక్కువా? ఒక సత్యాన్ని నీముందు వెలిపుచ్చుతున్నాను. వాడి పాట అంటే నాకెంత ఇష్టమో, వాడిపరిస్థితులంటే అంత జాలి... కాని, నాన్నకా విషయం తెలిస్తే బ్రతకనిస్తారా? అందుకని, ఎక్కడా నేను నిజం బయటపెట్టలేదు— చివరకి, నేటిదాకా నీదగ్గర కూడా...

నిన్న ఎవరితోనో నా పెళ్ళిగురించి మాటలాడుతున్నారు నాన్నగారు. హడిలిపోయాను. నిన్ను ప్రాణంగా చూసుకున్నాను కాదూ బావా? ఇలాగ నాగతికి నన్ను వదిలి, వాడినిపట్టుకుంటావా?

దయఉంచి, వాడిదారిన వాడిని పోనీ... నువ్వు లాయరువి కాబట్టి కాని, వాడి మామ నిన్ను కోర్టు కెక్కిద్దామనుకున్నాడు. పరిస్థితులన్నీ నా పీకచుట్టూ బిగుసుకుంటున్నాయి. ఏంచేసినా నువ్వే బావా.

నీ

ప్రభ

రెండుసార్లు, నాలుగుసార్లు చదివాడు వెంకట్రావు ఆ ఉత్తరాన్ని. ఏం చెయ్యడం?

ఆ సాయంసమయపు నిశ్శబ్ద పరిసరాలలో వాడి పాట వినిపిస్తోంది. ఏమిటి చెయ్యడం? వాడిని అధోగతికి వదలడమా? ఎలాగో బ్రతుకుతూన్న వాడిని ఏదో ఉపకారం చేస్తానని తీసుకొచ్చి వాడి జీవితాన్ని ఇంకా అధమం చెయ్యడమా?

కాని, ప్రభ? ఈ పరిస్థితుల్లో తమ ఇరువురి వివాహమూ అసాధ్యమే అయింది. పరిస్థితిని గమనించి ప్రభ తనకి రాస్తుందని అతనికి తెలుసును. అందుకే అత నన్నాళ్ళుగా తనుముందు ప్రభకి ఉత్తరం వ్రాయలేక పోయాడు.

ప్రభ అంటే వెంకట్రావు ప్రాణం ఈయడానికి సిద్ధంగా ఉండేవాడు— ప్రభకూడా అంతే. ప్రభ చదువుకున్న పిల్ల...స్వతంత్రభావాలు కలది. ఈ ఉత్తరంలో ఆమె ఎన్నడూ లేనంత క్రిందికి దిగింది—దానినిబట్టే తెలుస్తోంది. వాస్తవంగా ఆమెమనస్సు ఏ పరిస్థితుల్లో ఉందో.

అటూ ఇటూ ఊగులాడి అడి చివరికి ఏ నిర్ణయానికీ రాలేకపోయాడు వెంకట్రావు. అప్పటికి సాధకం ముగించాడు సాగరాజు; సంధ్యాదేవి తన ఛాయలని అలుముకేస్తోంది.

లేచి వసారాలోంచి హాలులోనికి వస్తూ, "ఎందుకండీ అలాగ ఉన్నారు?" అన్నాడు సాగరాజు.

ఈ "అండీ" కట్టించడానికి వెంకట్రావు చాలా ప్రయత్నించాడు. ఈ పరిస్థితిలో అతని కా విషయం మళ్ళీ చెప్పడానికి మనస్కరించలేదు.

"ఏమీలేదులే – నీసాధకం వింటున్నాను. ఏదో ఆలోచనలో పడ్డాను. ఇందాకటినించీ నువ్వు పాడినగీతం – ఏరాగం"

"అదా? ఖరహరప్రియ అండీ... చాలా చక్కటి గేయం కాదూ? చూడండి- రాగం ఆలాపిస్తాను"

మురళీస్వనం పరిసరాలని నింపివేసింది. చంద్రు డుదయించాడు. ఇంట్లో దీపం పెట్టారు...వాళ్ళిద్దరూ గానంలో తన్మయులౌతూనే ఉన్నారు. ఇంతటిలో సంగీతం మాస్టరు వచ్చినసంగతి తెలుసుకుని ఇద్దరూ బాహ్యప్రపంచంలో పడ్డారు.

"ఎంతసేపైందండీ వచ్చి?" అన్నాడు వెంకటరావు – ఆయనని కొంతసేపు నిలువబెట్టినందుకు చింతిస్తూ.

"ఒక పావుగంట అయిందిలెండి... అయితేనేం? ఆ రాగాలాపన వింటూంటే గంటలు నిలువబడొచ్చునుకదండీ?— లోనికి వెళ్లి పనిచూడు సాగరాజూ..."








నాగరాజు లోపలికి వెళ్ళాడు.

"అతనిముందు చెప్పాల్సిన విషయం కాదిది...ఇతనికి సరస్వతి ప్రసన్నత పూర్తిగా ఉంది బాబూ...ఆ రాగాలాపన చూస్తుంటే మహావిద్వాంసులని జ్ఞప్తికి తెస్తున్నాడనుకోండి - ఇంతా చేస్తే ఏమిటి చెప్పాను కనుక? గీతం చెప్పాను. ఆరోహణం, అవరోహణక్రమాలూ, లక్షణాలూను...అంతే."

వెంకట్రావు తన్మయుడై వింటున్నాడు. మాస్టరు చెప్పుకుపోతున్నాడు.

"నా విద్యఅంతా ఇంక మూడునెలలు.. వర్ణాలూ కృతులూ నాకు వచ్చినవన్నీ చెప్పేస్తాను...నా మాటవిని, మా గురువుగారిదగ్గరికి పంపండి—వారి వెనకాల తిరిగితే అద్భుతమైన పాండిత్యం సంపాదిస్తాడు. మీ జీవితమూ ధన్యం ఐపోతుంది...సరస్వతీస్వరూపాన్ని పైకి తీసేరండీ."

తరువాత తన పని చూసుకుని ఆయన వెళ్ళిపోయాడు. వెంకట్రావు ఒక నిశ్చయానికి రాగలిగేడు - ఏది ఎలాగపోయినా, నాగరాజులోని విద్యాపటిమని చూసి తీరాలని.

ఆ మర్నాడు తను ప్రభకి ఉత్తరం వ్రాశాడు:

ప్రభా!

నీ ఉత్తరం అందింది...ఈ నాటకంలో నీ పాత్రని సరిగా అర్థం చేసుకోలేకపోయాను. ఆ ఉత్తరం అందాక నాఅజ్ఞానం ఇంకా ఎక్కువే అయింది.

అయితే, ఒకటి బాగా తెల్సును మన ఇద్దరికీ—నాగరాజు నా రక్షణలో ఉండగా మన వివాహానికి మీ నాన్నగారి అంగీకృతి ఉండదని. మీ అన్నకికూడా ఆ దృష్టే ఉంది.

కాని, నాగరాజుని ఈ పరిస్థితిలో త్యజించడం నా వల్లకాని పని ప్రభా... వాడిలో అమృతం ఉంది. వాడిని మథించి ఆ అమృతాన్ని వెలిదీసే బాధ్యత నామీద వేశాడు భగవంతుడు. వాడిని నమ్మించి ద్రోహంచేసే పాపం నన్ను వడిగట్టుకోమంటావా?

నీకూ స్వతంత్రభావాలున్నయ్. చదువుకొన్నదానివి. నా హృదయం ఇచ్చి నిన్ను ప్రేమించానన్నే సంగతి నీకు తెల్సును. కాని, విధి బలీయం అయినప్పుడు తల ఒగ్గకుండా కుదురుతుందా?

ఇలాగ రాశానని నన్నపార్థం చేసుకోకు ప్రభా. మన కతీతమైన విపరీతశక్తులకి మనం లొంగిపోవలసి వచ్చింది.

కాని, మనకిసాధ్యమైనంత వరకూ ఆ పరిస్థితులని ఎదిరిద్దాం...

నీ మనస్సుకి నొప్పి కలిగించాను. ప్రభా, క్షమించు. కాని కర్తవ్యం అటు లాగుతోంది.

నీ,
వెంకట్రావు.

తరువాత రెండునెలలదాకా ప్రభ ఏమీ ఉత్తరం రాయలేదు.

* * *

నాగరాజు తన జీవితంలో కలిగిన అద్భుతమైన ఈమార్పుకి కొంచెం కొంచెంగా అలవాటుపడ్డాక, క్రమక్రమంగా సంగీత శిక్షణలో నిమగ్నుడవసాగాడు. ఎవరికైనా అనురక్తి ఉన్న విద్యని నేర్చుకోవడంచాలా సుళువు; అదే జీవితపరమావధిగా ఉంచుకున్నవాళ్ళమాట చెప్పనే అక్కరలేదు.

నాగరాజు సాధకం చూస్తూంటే అతని జీవిత పరమావధి సులభంగా అర్థం అయిపోయేది. రాగలక్షణాలు చెప్పేసరికి అతను ఆలాపనలో అద్భుతమైన తన సహజపాండిత్యాన్ని చూపగలిగేవాడు. సామాన్యంగా సంగీతం నేర్చుకునేవాళ్ళు చుట్టుప్రక్కల వాళ్ళకి బాధాకరంగా ఉంటారు. కాని నాగరాజుగానం ఆ ప్రారంభపరిస్థితుల్లో కూడా మనోరంజకంగానే ఉండేది. వెంకట్రావుకి అది ప్రాణంగానే ఉండేది.

స్వతస్సిద్ధంగా కర్ణాటక సంగీతం అంటే వెంకట్రావుకి ప్రాణం. త్యాగరాజూ, దీక్షితరూ అతనికి అపరదైవాలు. పద్నాలుగేళ్ళ ఈ బాలుడు త్యాగరాజకీర్తనలని మురళిమీద వాయిస్తోంటే అతనికి కళ్ళముందు దేవతలు నాట్యంచేసినట్లనిపించేది. ఒడలు పులకరించేది.

ఒక సంవత్సరం గడిచేసరికి ఆ వూరిలో నాగరాజు నేర్చుకునే విద్యనంతటినీ నేర్చుకున్నాడు. ఇంక ఏమిటి చెయ్యడమా అని ఆలోచనలో పడ్డాడు వెంకట్రావు. సంతోషంగా నాగరాజుని చేరతీసి విద్య నేర్పే వాళ్లు చాలామంది పెద్దవాళ్లు ఉన్నారు. నాగరాజు తిండికీ, బట్టకీ ఇచ్చే తాహతు తనకీఉంది. కాని, నాగరాజుని వదలి ఉండడమే, ఒక సమస్య అయింది వెంకట్రావుకి. ఏవో పూర్వబంధాలు వెంకట్రావుని నాగరాజుకి దగ్గరగా చేర్చాయి. చెప్పలేని బలంగల అనురాగం వాళ్లిద్దరిమధ్యా ఉండేది.

ఒకనాడు రాత్రి..ఒంటిగంట అయింది- వెంకట్రావుకి మెలకువ వచ్చింది... కారణం అతనికి ప్రభ కలలోకి వచ్చి ఏడుస్తూ ఏదో అంటూన్నట్లు - త్రుళ్ళిపడి లేచాడు.

వెన్నెల నిండుగా కాస్తోంది. అతను లేచి చెట్టుక్రింద కుర్చీలో కూర్చున్నాడు. అతనితోనే తన దుఃఖాన్ని ప్రభ చెప్పుకునేలాగ అతను బాధపడుతున్నాడు.

ఈ సంవత్సర కాలంలో ప్రభ రాసిన ఉత్తరాలు ఒక్కసారి జ్ఞప్తికి వచ్చాయతనికి. అన్నిటిలోనూ సుమారుగా ఒకటే విషయం - ఏలాగైనా నాగరాజుని వదలిపెట్టి రమ్మని...

వెన్నెల చాలా బాధాకరంగా ఉంది. అతని మనస్సు వివిధ భావనలకి ఆలం అవుతూంది. ఈ నాగరాజు తన జీవితంలోకి ఎందుకు రావాలి? ప్రభ తండ్రికీ వీడికీ అంతటి వైరం ఎందుకు ఉండాలి? ప్రభ తండ్రి కెందుకు ఎదిరించదు?

అకస్మాత్తుగా అతనికి ఒక ఆలోచన కలిగింది... నాగరాజుని మళ్ళా వాడి ఇంటికి పంపేసి, ప్రభని వివాహం చేసుకుని, నిర్విచారంగా జీవితం గడిపితే?

ప్రభ! పాపం, తనకోసం ఎంత బాధ పడుతోంది! ఆమె కోరినదంతా స్వార్థం కానేకాదు. తీయటి కలలు కనికని, ఈనాడు తన తొందరపాటువల్ల ఆమె బాధపడుతూంది!

"నిన్ను వివాహం చేసుకుంటాను ప్రభా! అందుకే వచ్చాను" అని తాను చెప్ప గలిగితే, పాపం ఆమె ఎంతగా సంతోషిస్తుంది!

నాగరాజుని తానొక మార్గంలో పెట్టాడు. ఇంక వాడెలాగో జీవితపథంలో తన బాధ తాను పడాలికాని, తనెంతదాకా సహాయం చెయ్యగలడు? ఆసహాయం కూడా తనకోసం ప్రభని బాధపెట్టి!...

ఈ ఆలోచనతో, ఆ మాటలు చెప్పడానికి వెంకట్రావు నాగరాజుగదిదాకా [illegible]. ఆగదిలోనూ కిటికీలోంచి వెన్నెల పడుతూ, నాగరాజుముఖాన్ని ప్రకాశవంతంచేస్తూంది.

వెంకట్రావు గుమ్మందాకావెళ్లి అక్కడ నిలబడ్డాడు.

ఒక్కసారి అతని నరాలు ఎవళ్ళో లాగినట్లైంది. తనని నమ్ముకుని వాడెంత నిర్విచారంగా నిద్రిస్తున్నాడు! ఒక్కసారిగా లేపి, "మనస్నేహం ఇంక సరి నాగరాజూ, తెల్లవారేసరికి మీవూరు వెళ్లిపో" అంటే వాడెంతగా ఆశ్చర్యపడి బాధపడతాడు? "నేనేం చేశానండీ?" అంటే తానేమిటి జవాబు చెప్తాడు? - పాపం నాగరాజు!

వెంకట్రావు చాలా సిగ్గుపడ్డాడు... తొందరగా వెనుదిరిగాడు.

మిగిలినరాత్రి అతను జాగరం చేశాడు.

* * *

ఆ మర్నాడు వెంకట్రావు బేంక్‌లో ఉన్న నూటరూపాయిలూ తీసుకున్నాడు. బట్టల కొట్టుకి వెళ్ళి నాగరాజుకి మంచి బట్టలు తీయించాడు. కొత్తది సూట్‌కేసూ, బెడ్డూ కొన్నాడు.

అత్తవారింటికి పంపినంత హంగామా చేసి, నాగరాజుని మద్రాసు ప్రయాణానికి సిద్ధపరిచాడు. అక్కడే వాడి కొత్త గురువుగారు ఉన్నారు.

ప్రత్యేకం ప్రయాణ ముహూర్తం పెట్టించి, సంగీతం మాస్టరునీ నాగరాజునీ మెయిల్ ఎక్కించి బరువుగుండెలతో తిరిగి వచ్చాడు వెంకట్రావు. అవును - అవతలవాళ్ల మంచికోసం కూడా మన అభిమానాలని మరవాల్సి ఉంటూంటుంది కొన్ని సమయాలలో.

* * *

ఒక సంవత్సరం గడచిపోయింది - ఆతరవాత.

ఆ సంవత్సరము నాగరాజులో చాలా మార్పులని తీసుకువచ్చింది. మొట్టమొదటిసారి నాగరాజు కచేరీలో తన విద్యాప్రదర్శనం చేసి, గురువుగారితో సహా అందరి మెప్పునీ అందుకున్నాడు. ఆవార్త దినపత్రికలలో కూడా, ప్రచురింపబడింది. తన జీవితంలో ఒక ఘనకార్యంసాధించినట్లు గర్వపడ్డాడు వెంకటరావానాడు. నాలుగురోజులు పోయాక నాగరాజు వెంకట్రావుకి ఉత్తరంరాశాడు.

"శ్రీ అన్నగారికి:

మీదయతో నేను సాధించిన విజయాన్ని గురించి మీరు తెలుసుకునే ఉంటారు. ఈ సమయంలో నా కృతజ్ఞతని తెలుపుకుంటున్నాను. ఇప్పుడు నాకు చాలా ఆహ్వానాలు వస్తున్నాయి - ముఖ్యంగా రెండు స్టూడియోలనించి నా కచేరీలకోసం ఆహ్వానాలు వచ్చాయి. త్వరలో ఏర్పాటుచేయించడానికి అంగీకరించాను. ఈ ఆహ్వానాలని నా అదృష్టంగా పరిగణిస్తున్నాను.

క్షేమంగా ఉన్నాను. విశేషాలు లేవు.

చిత్తగించవలెను,

నాగరాజు.

స్టూడియోలకి నాగరాజు వెళ్తూన్న సంగతి వెంకటరావుకి చాలాకష్టాన్ని కలుగజేసింది. కేవలం వ్యాపారదృష్టితో పనిచేసే చోటులలో శాస్త్రీయసంగీతానికి స్థానం లేదని అతని విశ్వాసం.

నాగరాజు స్టూడియోలపట్ల ఎక్కువ ఆతృతచూపడం వెంకట్రావుకి కష్టం కలుగజేసింది. అతను నాగరాజుద్వారా సంగీతానికి సేవచేద్దామనుకున్నాడు. కాని ఆ సంగీతం చవకసంగీతం కాదు. ఏశాస్త్రం నేర్చుకోవడానికీ, సాధన చెయ్యడానికీ చాలాకష్టమో, అలాటి కర్ణాటకసంగీతమే అతనికి ఆరాధ్యం. నాగరాజు ఉద్దేశాలతనికి పన్నీటిని బూడిదలో పోసే ప్రయత్నాలలాగ కనిపించాయి.

తన ఉద్దేశాలను నాగరాజుకి రాద్దామనుకున్నాడు. కాని, నాగరాజు బాధపడతాడనే ఉద్దేశం అతనిచేత వెనక్కి లాగించింది. కాని, నాగరాజు తప్పుదారిని పడిపోతున్నాడనే బాధ ఎక్కువై, నాలుగురోజులుపోయాక అతనికి వెంకట్రా విలాగ వ్రాశాడు:

చిరంజీవి, నాగరాజుకి:

ఆశీర్వచనాలు.

నీ గానమాధుర్యంతో చాలామందిని సంతసింపజేస్తున్నావని తెలుసుకుని చాలా సంతోషించాను. నీ అభ్యుదయం కాంక్షించేవారిలో ప్రథముడినని నీకు రాయనక్కరలేదనుకుంటాను.

అందుచేతనే, ఈ సమయంలో నీకు కొంచెం చెప్పదలచుకున్నాను.

భగవంతుడిచ్చిన పాండిత్యంతో నువ్వు స్వయంకృషిచేసి, చాలా విద్యని ఆర్జించావు. కర్ణాటక సంగీతంలో నిధివనే బిరుదు పొందబోతున్నావు.

కాని, కేవలం వ్యాపారంకోసం నువ్వు ఈ విద్య నభ్యసించలేదని మరిచిపోకు. ఈ సంగీతశాస్త్రాన్ని నిష్కల్మషంగా నేర్చుకుని, వ్యాపింపచెయ్యవలసిన బాధ్యత నీమీద ఉందని మరిచిపోకు.

సినీమావాళ్లు నిన్ను ఆహ్వానించారంటే ఎందుకో తెల్సుననుకుంటాను. నీ విద్యని వికృతరూపాలతో ప్రజలకందించి డబ్బు

చేసుకోడానికి నిన్ను వాళ్లు కొనుక్కుంటారు. అప్పుడు నువ్వు త్యాగరాజునిగాని, దీక్షితార్ నికాని, ముత్తుస్వామినికాని, నీ గురువుగార్నిగాని, జ్ఞాపకం ఉంచుకోవడమే కష్టం అవుతుంది - ఒక్కమాటలో చెప్పాలంటె శాస్త్రీయ సంగీతానికే అపచారం చేయవలసివస్తుంది.

స్టూడియోలకి వెళ్ళి కచేరీ లిచ్చేముందు నువ్వీ మాటలు మనస్సులో ఉంచుకుంటే ఈ ప్రమాదం ఉండదని ఆలోచించి ఈ మాటలు నీకు రాస్తున్నాను. గ్రహించు.

వెంకటరావు.

ఈ ఉత్తరం తరవాత పదిరోజులకి గాని జబాబులేదు. అప్పుడు నాగరాజు జవాబు ఇలాగఉంది :

శ్రీ అన్నగారికి :

ఈ పదిరోజులూ పని తొందరలో మీకు జవాబు వ్రాయలేకపోయాను. మీ ఉత్తరం చేరేక నా జీవితంలో నేను ఆశించని రెండు గొప్ప అదృష్టాలు కలిగాయి. ఆ రెండు స్టూడియోలవారూ నన్ను సంగీత శాఖలో ఉంచుకుంటామని కోరారు. ఇప్పుడు నెలకి అయిదువందలు ఇస్తానన్న ఒక స్టూడియోలో చేరాను.'

మీరు సినీమాసంగీతాన్ని గురించి వెల్లడించిన ఉద్దేశాలు ఇప్పుడు పరిశ్రమకి అనువర్తించవు. నావిద్యకి వాళ్ళు వన్నెలు దిద్దుతారు. దేశంఅంతటా పేరు తెప్పించడానికే ప్రయత్నిస్తారు.

ఈరోజు నే అడ్వాన్సు పుచ్చుకున్నాను. మీ రింకొకలాగ భావించరని నాకు తెల్సును.

మీరింక డబ్బుపంపకండి.

చిత్తగించవలెను,
నాగరాజు.

* * *

హాలులో నిశ్శబ్దంగా కూర్చున్న ఒకే ఒకజీవి—వెంకట్రావు గడియారం చేసే శబ్దాన్ని గమనించకుండా ఒక్కసారిగా ఈ రెండుసంవత్సరాల చరిత్రనీ నెమరు వేసుకున్నాడు.

ఎదురుగా నాగరాజు రాసిన ఈ చిట్టచివరి ఉత్తరం బల్లమీద పేపర్ వైట్ క్రిందనుంచి తొంగిచూస్తూంది.

వెంకట్రావుకి ఈఉత్తరం చాలా బాధని కలిగించింది. నాగరాజింత తొందరపడతాడని అత నెన్నడూ అనుకోలేదు. అథమం తన అనుమతినైనా అడుగుతాడను కున్నాడు.

ఈ సంవత్సరమూ తా నెంత త్యాగం చేశాడు! బేటరీ కొనక రేడియో అలాగే పడుకుంది. గుమాస్తాని మానిపించాడు. కొత్తగా బట్టలుకూడా కుట్టించుకోకుండా ధనం మిగిల్చి నాగరాజుకి పంపాడు. - ఆ చిన్నవూరులో ప్రాక్టీసుమీద ఏమాత్రం వస్తుంది కనక ? మిగిలినదానిలో అతను కష్టంగా సర్దుకుని కాలక్షేపం చేస్తున్నాడు.

ప్రభ - పాపం, ఈ సంవత్సరంనించీ అస్వస్థతతోనే ఉంది. కారణం సువిదితమేను. ఎలాగైనా ఒక్కసారి వచ్చిచూసి వెళ్ళమంది—అదే తన హృదయానికి శాంతిని ఇస్తుందని... కాని—

కాలం గడిచిపోతోంది.

ఇంతలో ఎవరో వచ్చారు. "బాబూ!" అని పిల్చారు.

ఎవరో పార్టీలు – మరునాడు ఏదో కేసు విశాఖపట్నం వాయిదా పడిందని జ్ఞాపకం చెయ్యడానికి వచ్చాడు.' ఉదయం బయులుదేరుతానని చెప్పి పంపాడతన్ని వెంకటరావు.

తెల్లవారింది. కాలకృత్యాలు తీర్చుకుని, బట్టలు వేసుకుని ప్రయాణానికి సిద్ధం అయాడు.

"కేంపు వెళ్తున్నానమ్మా–విశాఖపట్నం. రేపు తిరిగివస్తాను."

"ప్రభని మాసివస్తావా ?"

కొంచెం ఆగాడు వెంకటరావు.

"అదేమిటిరా అలా చూస్తావు ? పాపం ఎలాగ ఉందో...ఉత్తరం కూడా రాసిందంటున్నావు రమ్మని...అంత ఉదాసీనత ఏమిటి? వెళ్ళిచూసిరా నాయినా. ఏమైనా దూరంది కనకనా ?"

"అలాగేనమ్మా."

నెమ్మదిగా స్టేషన్ కి బయలుదేరాడు. దారిలో దినపత్రిక ఒకటి కొనుక్కున్నాడు ఒకటోపేజీలో రంగురంగుల ప్రకటనలో పెద్ద అక్షరాలలో రాసిఉన్నది.

"సినీ సంగీతానికి క్రొత్తకళ. ఆరంభం...

మా నూతన చిత్రానికి సంగీత దర్శకులు శ్రీనాగరాజు భాగవతార్. ఇంకా ఏమో..."

వెంకట్రావు పత్రికని మడిచి తొందరగా నడిచాడు.

ఆరోజంతా అతను చాలా అన్యాసక్తుడుగా ఉన్నాడు. జీవితం అంటే ఏదో దుఃఖపూరితమైన యాత్రలాగున కనిపిస్తూందతనికి. కృతజ్ఞతారాహిత్యమూ, స్వార్థపరమూ మాత్రమే దానిలోని ముఖ్యవిషయాలలాగ అనిపిస్తూందతనికి.

నాగరాజుని చేరదీసినందుకు మొట్టమొదటిసారిగా అతను ఈరోజు విచారిస్తున్నాడు.

రైలుదిగేసరికి చాలా వ్యవధి లేదు. హోటల్లో భోజనంచేసి కోర్టుకి వెళ్ళాడు. నాలుగయేసరికి హోటల్లో గదికి తిరిగి వచ్చాడు.

ప్రభ అతని జ్ఞప్తులని బాధిస్తూంది. పాపం, చాలా నీరసించిఉంటుంది. ఆమెని తొందరగా చూడాలని ఒక్కసారతనికి బలమైనవాంఛ కలిగింది. ఏనాడో వాళ్లిద్దరిమధ్యా గడిచిన మధుర క్షణాలన్నీ మళ్లీ అతనికి జ్ఞప్తివచ్చి అతనిని ప్రియాసందర్శనంకోసం తొందరపెడుతున్నాయి.

(తరువాయి ౩౯-వ పేజీ చూడండి)

# అన్నదమ్ములు

## శ్రీ తలిశెట్టి సభాపతిరావు

రాత్రి ప్రొద్దుపొయ్యేదాకా రావు మందిరంలో పేకాడి, పోయినంత పోగొట్టుకుని ఇంటికి చేరాడు పట్టాభి రామయ్య. అప్పటికే అన్న వెంకట్రామయ్య భోంచేసి కునుకు తీస్తున్నాడు. వదినెగారి జాడ కనపడనే లేదు. తన భార్య రత్నం మాత్రం దొడ్లో మంచంమీద వెల్లకిలా పండుకునివుంది.

పట్టాభి ఒక్క క్షణం నిశ్శబ్దంగావుండి, చిన్న పొడిదగ్గు దగ్గాడు. రత్నం చూసింది. తాను బట్టలు మార్చుకునేందుకు గదిలోకెళ్లాడు. రత్నంవచ్చి వంటయింట్లో ప్రవేశించింది. పట్టాభి బట్టలు మార్చుకుని, కాళ్ళూ చేతులూ కడుక్కుని తుడుచుకుంటూ వంటగదిలో ప్రవేశించి, వడ్డన చేసివున్న కంచానికెగబడ్డాడు. రత్నం మళ్ళీ బయటికొచ్చి నిలబడింది.

పట్టాభి కిదంతా కొత్తగానూ, ఏనాడూ లేని నిశ్శబ్దం ఆనాడు అలుముకున్నట్లు కన్పించింది. తన భార్య కూడా ఆ రోజు తనపట్ల అలా ప్రవర్తించటం, అతని కేదో సందేహాన్ని కలగజేసింది...మాట్లాడకుండా మారు కావల్సినా అడక్కుండానే భోజనం ముగించాడు. అసలీ మార్పుకు కారణం ఏమిటో తెలుసుకోవాలన్న కోరిక అతన్ని ఎంతో తొందరపెట్టింది.

పట్టాభి భోంచేసిన తర్వాత, తనూ రెండు మెతుకులు తిని, వంటిల్లు సర్ది, భర్త గదిలో కెళ్ళి మూలనున్న చాప పరచుకు పడుకోబోయింది రత్నం. భార్యకోసం ఆతృతతో ఎదురుచూస్తున్న పట్టాభి ఆశ్చర్యపడ్డాడు. తన భార్య కోపగించినప్పుడల్లా అవలంబించే పద్ధతే ఇది. గభ్భున లేచి వచ్చి "రత్నం!" అంటూ అమాంతంగా పట్టుకున్నాడు.

"వదలండి." ఆమె విదలించుకోబోయింది. పట్టాభి నీరయ్యాడు.

"రత్నం! ఇలా చూడు. ఎందుకూ ఈ కోపం" అంటూ బుజ్జగించబోయాడు.

"నా కోపతాపాలు ఎవర్నేం చేస్తయ్. దాసిబ్రతుకు బ్రతుకుతూన్న నే నెవరి మీద కోపగించగలను"

కొంత అర్థమైంది పట్టాభికి. తప్పకుండా తన భార్యకీ, వదినెగారికీ ఏదో జగడమైందనుకున్నాడు. అయినా ఇద్దరూ సామాన్య విషయాలమీద కీచులాడుకోవడం అప్పుడప్పుడు వున్నదే. కాని రత్నం ఇంత మొండిగా ఎప్పుడూ ప్రవర్తించలేదు.

"రత్నం అసలు సంగతేమిటో చెప్పకుండా బాధపెడుతున్నావ్...చెప్పవే"

"ఆ!—అయినా నే నెన్నిసార్లు చెప్పలేదు. మీ రెన్నిసార్లు తీర్చలేదు. మీకే పౌరుషం ఉన్నవాళ్లైతే పరిస్థితు లెందుకిలా వుంటయ్."

"..........."

"ఎప్పుడూ నా మాటంటేనే గిట్టదు కదా. ఆవిడవల్లే ఈ సంసారం బాగుపడ్డట్లు ఆవిడే యజమానురాలన్నట్లూ మాట్లాడుతుంది. తెల్లారి లేచింది మొదలు, పేక ఆడుతూనో, రిజాలాగా తిరుగుతూనో మీరుంటారట; ఇంట్లో వుండే పాస మెత్తు పనైనా చెయ్యకుండా, సీతాకోకచిలుకలా అలంకరించుకునే కూర్చుంటానట. సంపాదన లేకపోగా వున్నదాన్ని పాడుచేసుకోడంకూడా తెలీదట, మరి మీవల్లా నావల్లా ఏం ఆస్తులు పోయినయ్యో, ఎన్ని అగచాట్లు వచ్చినయ్యో ఇంతకీ కట్టుకున్నవాడు పౌరుషం లేనివాడైం తర్వాత ఎవరైనా పడక తప్పుతుందా?"

"..........."

"ఆఖరికీనాడు అనుకున్నంత మాటా అన్నదావిడ. దిక్కూ మొక్కూ లేకండా, కూటికీ గుడ్డకీ ఈ పంచచేరినట్లు మాట్లాడింది...అంత ఇష్టంలేకపోతే వేరే వుండమంది" అంటూ ఒక వర్షాన్ని కురిపించింది రత్నం. అంతవరకూ బిగబట్టుకు వస్తూన్న దుఃఖం ఒక్కసారి పైకుబికింది.

పట్టాభి చాలసార్లు విన్నాడిదంతా. తనకు తెలుసు వదినె తన భార్యను మందలించడం. అయినా ఇంటి పెద్ద అన్నగారుండగా తన కెందుకన్నట్లు వూరుకున్నాడు. బహుశా వదినె ఈవిషయం గుర్తించక లోకువ చేసిందేమో...అదీకాక ఆవిడ ఎన్నడూ ఇంత కఠినంగా మాట్లాడలేదే. ఈనాటికి ఈ మాటలు ఎట్లా అందో. పోనీ అన్నగారైనా తనతో ఎన్నడూ అన్లేదే. బహుశా అన్నయ్యే వదినతో అనిపించాడేమో!

రత్నం మళ్ళీ మొదలెట్టింది. "ఏం? ఆవిడమాత్రం ఈ యింటి కోడలుకాదూ?

ఆమె కెంత హక్కుందో, ఈ ఇంట్లో నాకూ అంతే వుంది. అయితే ఆ ముద్దు ఆయన చెల్లిస్తున్నాడు. మా ఆయన చేతకాని వాడయ్యాడు. అంతే!"

పట్టాభికి బుర్ర వేడెక్కింది. ముఖం తీవ్రరూపం దాల్చింది. మనసులో అనుకున్నాడు. "నిజమే! తన భార్య, వదినే ఇద్దరూ ఆయింటి కోడళ్ళే. ఇద్దరూ సమాన హక్కు కలవాళ్ళే... పెద్దదైనంత మాత్రాన వదిన, తన్ను తన భార్యని గౌరవించక పోవడం బిరుసుతనం కాదూ...ఎన్నాళ్ళిలా తగవులాడుకోడం. తనకు రావాల్సిందేదో తేల్చేసుకుని వేరే వుండటం ఉత్తమం" అనుకున్నాడు. తెల్లవార్లూ ఈ సంగతే తీవ్రంగా ఆలోచించాడు. మధ్యమధ్య భార్య చెప్పిన మాటలు మంత్రాల్లా పనిచేసి, పట్టాభి నిశ్చయాన్ని మరింత బలపరిచినయ్.

మరుచటిదినం. వీధిలోకి వెళ్ళబోతూన్న వెంకట్రామయ్యని, పట్టాభిరామయ్య నీతో మాట్లాడాలంటూ ఆపాడు. మెట్లు దిగుతున్నవాడల్లా ఆగి, ఆశ్చర్యంగా చూశాడు తమ్ముడివంక...ఇద్దరూ చావిడిలోకొచ్చారు.

"నిన్న జరిగిన విషయం తెలుసుగా" అన్నాడు పట్టాభి.

"ఆ!...ఆ విషయంలో మనం మాట్లాడేదేముంది?"

"అదే! అవిడన్నమాట—మీకంత కష్టంగా వుంటే నే వేరే కాపురం వుంటాను." అన్నాడు తడుముకోకుండా.

వెంకట్రామయ్య నిర్ఘాంత పోయాడు. ఒక్కసారి చిరుచెమటలు పట్టినయ్. తనతో మాట్లాడుతూన్నది తన తమ్ముడేనా అని, తాను వింటూన్నది అతనన్న మాటలేనా అని తికమకపడ్డాడు—ఇంతలో ఏదో పనిమీద అలా వచ్చిన వెంకట్రామయ్య భార్య, ఆ ఘట్టాన్ని చూసి అలాగే గడపలో వుండిపోయింది. వెంకట్రామయ్య కొంచం తమాయించుకుని ఇలా అన్నాడు.

"పట్టాభీ! నువ్వేమంటున్నావో నీకు తెలుసా?"

ఒక్కసారి తీవ్రంగా చూశాడు అన్నయ్యవంక—వదిన్ని చూడగానే, అతనిలో అప్పటికే తీవ్రరూపం దాల్చి వున్న కోపం, ద్విగుణీకృతమయింది. మళ్లీ అన్నాడు "నే వేరే వుంటాను అని అన్నా"—

ఈమాట విన్న వెంకట్రామయ్య భార్య కూడా గతుక్కుమంది. వెంకట్రామయ్య అదోలా చూశాడు తమ్ముడివంక.

పట్టాభిరామయ్య మళ్ళీ అందుకున్నాడు. "ఇద్దరికీ సమాన హక్కులున్న ఈ యింట్లో నాకు గౌరవం లేదని. వయస్సుకు చిన్నవాడినైనంత మాత్రాన గౌరవహీనుడినా?" వెంకట్రామయ్య చిన్నగా నవ్వాడు. "ఓస్! ఇదా సంగతి. ఈమాత్రానికే వేరేవెళ్ళిపోవాలా? ఈక్షణం నుంచీ నువ్వు నీభార్యే పెత్తనం వహించండి. మేము కోరేదీ అదే. బాధ్యతవహించమనే మీ వదినకూడా అంది. ఏదో పూర్వీకులు, తినో తినకో ఇంత ఆస్థిపాస్తుల్ని సంపాదించారు. వాటిని పొదుపు చేసుకోవడం మనవిధి. మంచికి చెపితే అపార్థం చేసుకుని అలా తొందరపడతావేం?" అన్నాడు. ఈపరిణామానికి కారణం తన

మరదలేనన్న సంగతి గ్రహించక పోలేదు వెంకట్రామయ్య.

"నేనుమాత్రం ఏం చెడ్డ అన్నాను. అస్తమానం పేకాటలో కూర్చుంటే ఎట్లా; కాస్త ఆపనీ ఈపనీ చేస్తువుండాలి. మా అన్నయ్య ఒక్కరు ఎంతని తంటాలు పడతారు అన్నా. ఆమాత్రానికే వేరే వుండాలా నాయనా! అయినా యజమానులైన అన్నదమ్ముల్ని విడిపొమ్మనడానికి నే నెవర్ని" అంటూ సమర్థించబోయింది వెంకట్రామయ్య భార్య కాంతమ్మ.

"నువ్వూరుకోవే!" అంటూ, తమ్ముడి వంక తిరిగి "సరే లేవోయ్ ఆలోచిద్దాం" అంటూ లేచాడు వెంకట్రామయ్య.

"ఆలోచ నేముంది. ఒకటి రెండు రోజుల్లో అంతా జరిగి తీరాల్సిందే" అంటూ విసురుగా తనగదిలోకి వెళ్ళిపోయాడు పట్టాభిరామయ్య. బరువుగా నిట్టూరుస్తూ, మెట్లుదిగాడు వెంకట్రామయ్య.

ఈసంఘటన జరిగి పూర్తిగా రోజైనా కాలేదు వూరంతా అట్టుడికి నట్టుడికింది. అంతా విస్తుబోయారు. వెంకట్రామయ్య కుటుంబ గౌరవాన్నీ, తాహతునీ ఎన్నాళ్లనుంచో ఎరిగున్న వారంతా, కారణం ఏమిటంటూ ప్రశ్నించారు. పాపం!

వెంకట్రామయ్య ఏమని చెప్తాడు? తనూ, పట్టాభీ ఏక గర్భజనితులు. ఎంతో కట్టుబాట్లతో పెరిగి గుట్టుగా సంసారాన్ని సాగిస్తున్నారు. ఈనాడు ఇద్దరూ వేరవుతున్నారంటే ఏం కారణం చెప్పడం?

వెంకట్రామయ్యకు తెలుసు తన తమ్ముడివద్ద నిలకడ లేదని. తనకు తెలీకుండా ఎంతడబ్బు తగలెయ్యలేదు. పేకాట మాన్పించేందుకు తనెంత ప్రయత్నించలేదు. ఓర్పుతో నేర్పుగా తన తమ్ముడిని త్రిప్పజూశాడు. లాభం లేకపోయింది. బ్రతిమిలాడాడు. చేతులుపట్టుకుని వంశగౌరవం కోసం, తనకా వూళ్ళోవున్న ప్రతిష్టకోసం, ఈపట్టుదల వదలమన్నాడు — చివరికి భార్యమాటవిని, పచ్చని సంసారాన్నీ, పాడిపంటలతో వర్ధిల్లుతోన్న ఇంటినీ విభాగం చెయ్యడం అధర్మమని వాదించాడు. గత్యంతరం లేకపోయింది. చివరికి వూళ్ళోవున్న నలుగురి పెద్దల్తో చెప్పించి చూశాడు. పట్టినపట్టు మరింత బిగిసిందే కాని, ఏమాత్రం సడల్లేదు. తుదకు కన్నీళ్లతో వెంకట్రామయ్య, పౌరుషంతో పట్టాభిరామయ్య వేరయ్యారు. ఆస్థిపాస్థుల్ని ఇద్దరూ సరిసమానంగా పంచుకున్నారు. పట్టాభిరామయ్య అవతలివీధిలో తన భాగానికి వచ్చిన ఇంట్లోకి, భార్యా సమేతంగా వెళ్లిపోయాడు. వున్న ఇంట్లోనే వెంకట్రామయ్య, అతని భార్య కాంతమ్మా విచారభారంతో కుంగిపోయారు. బొడ్డున తాళాలు పెట్టుకుని అధికారం చలాయించాలనుకున్న రత్నం కోరిక తీరింది.

ఆనాటినుండీ అన్నదమ్ములిద్దరూ కలుసుకోలేదు. పట్టాభిరామయ్య కీ సంగతి గుర్తేలేదు. ఈ అన్నా, తమ్ముడూ ఒకే రక్తాన్ని పంచుకుని జన్మించినా, ఇద్దరి మనస్తత్వానికీ చాలా భేదంవుంది. వెంకట్రామయ్యది శాంత స్వభావం, నెమ్మదిగల మనిషి. పట్టాభి దూరాలోచన లేనివాడు. దురుసువాడు. పాతికేళ్ళకు పైగావున్నా అతనికి శ్రద్ధఅనేదేలేదు. ఏదో వేళకింటికొస్తూ వుండడం, వడ్డించింది తింటూ పోతూ వుండడం, పేకాటతో కాలం వెళ్ళబుచ్చడం అలవాటైంది. తమలో ఎన్నడూ, ఎవరికీ అలవాటుకానిది పట్టాభికి అలవడ్డం వెంకట్రామయ్యకు ఎంతో దుఃఖకారణమైంది. స్వతంత్రుడుగా లేనంతవరకూ ఎలాగో గడిచింది. ఇక ఇప్పుడు తమ్ముడిలో ఎలాంటి మార్పు వస్తుందోనని భయపడ్డాడు. లోకం తన్నాడిపోస్తుందేమోనని బాధపడేవాడు.

రోజులూ, నెలలూ, సంవత్సరాలూ గడిచినయ్. ఆదిలో తాను భయపడ్డట్టుగానే రానురాను పట్టాభినిగురించి తాను వింటున్నవార్తలు భయకంపితుడ్ని చేసినయ్. అల్లరిచిల్లరగా తిరుగుతున్నాడనీ, వున్నదంతా జూదంలో తరుగుతోందనీ వాళ్లువీళ్లూ చెప్తుంటే విని విచారించేవాడు. కాంతమ్మకూడా ఇరుగుపొరుగు చెప్పిన మాటలువిని బాధపడేది. పోయినసారి కరణంగారింట్లో శుభకార్యం రోజున తన తోడికోడల్ని చూసి ఆశ్చర్యపడింది. ఆమెలో అనుకోని మార్పు వచ్చింది. అందంగా, బొద్దుగా ఎప్పుడూ శీతాకోకచిలుకలా అలంకరించుకునివుండే రత్నం, లోతుకుపోయిన కళ్ళతో చిక్కి సగమైంది. ఆనాటి డాబూ, దర్పమూ మాయమైనయ్. సామాన్యంగా తయారైరావడం కాంతమ్మ కెంతో తలకొట్టినట్లయింది. కారణం తనే వూహించుకోలేకపోయింది.

ఇంటికొచ్చి భర్తతో చెప్పింది. వెంకట్రామయ్య నిట్టూర్పు విడుస్తూ అన్నాడు. "అదీ మనలాగే బాధపడుతోంది. వాడికి అహర్నిశలూ జూదంతోనే సరిపోతూంది. ఇల్లూ, సంసారమూ, పెళ్లామూ అని వాడికేమన్నా దండమో స్తేనా. వున్న ఆస్తంతా తగలేస్తున్నాడు. చివరికి ఆ మిగిలిన నాలుగెకరాలు మొన్న దసరా వెళ్లింతరవాత మార్వాడీకి తనకా రాశాట్ట."

"ఆ!...అంతవరకూ వచ్చిందా?" అంటూ కాంతమ్మ గుమ్మానికి చేరబడిపోయింది.

"మీరయినా కలిసి మాట్లాడలేకపోయారా. ఎంత వేరున్నా తమ్ముడేగా. అతడలా పాడవడం మీకుమాత్రం అగౌరవం కాదూ?"

"పిచ్చిదానా! చూస్తూ వూరుకున్నానంటావా. చెయ్యవలసిన ప్రయత్నాలు

చేశాను. చెప్పించవలసినవాళ్ళచేత చెప్పించాను. వాడు వింటేనా ?—ఇంతకీ శని దినాలు వాడి నెత్తిన తాండవ మాడుతున్నయ్. ఎలా జరుగుతుందో." అంటూ కన్నీళ్లు పెట్టుకున్నాడు వెంకట్రామయ్య.

పట్టాభిరామయ్య వేరింట కాపురం వచ్చిందగ్గరనుండీ సర్వస్వతంత్రుడి ననుకున్నాడు. తన ఇష్టం వచ్చినట్లు తిరగడం మొదలెట్టాడు. రత్నం మొదట్లో భర్తను ఏమీఅనలేకపోయినా, రానురాను భర్తలో వస్తూన్న మార్పునుగురించి భయపడింది. మెల్లిగా మంచిమాటల్తో చెప్పింది. బ్రతిమాలుతూ ఏడ్చింది. అతని ప్రవర్తన ఫలితంగా ఇంట్లో ఏర్పడుతూన్న లోటును గుర్తించమంది. వున్న ఆస్తంతా ఇలా తగలవేస్తే ముందు బ్రతుకుతెరువు ఎలాగో ఆలోచించమన్నది.

కాని—దుర్వ్యసనాలకు పూర్తిగా లొంగిపోయిన పట్టాభికి ఈమాటలేం రుచించలా. ఏ మాటల్తో తన భర్తను మంత్రబగునిలా చెయ్యగలిగిందో, ఆ మాటలు నేడు ఏందుకూ పనికిరాకుండాపోయినయ్. వున్న బంగారం చిల్లరామల్లరా బజారున బడినయ్. పాపం! బోసిగావున్న తన మెడను చూసి ఎన్నో సార్లు ఏడ్చింది. తన భర్త ఎందుకిలా నాశనమవుతున్నాడో ఊహించుకోలేకపోయింది....తొందరపడి పెద్దఇంట్లోంచి రావడమేమోనని అనుకునేది.

మరో మూడుకాలండర్లు మారినయ్. ఈ లోపల దేశంలోనూ, ముఖ్యంగా ఆ గ్రామంలోనూ అనుకోని మార్పులు వచ్చినయ్. నిర్ణీత సమయానికి వర్షప్రాప్తి లేక పంటలు లేక చిన్నచిన్న రైతులంతా చేతు లెత్తారు. అలాంటివారిలో పట్టాభి ఒకడు. ఇంతేకాక భూమి తనఖా పట్టిన మార్వాడీ ; పెట్టిన గడువులయినా, అసలు ఇవ్వలేదు సరికదా వడ్డీయైనా కట్టలేదని కోర్టులో దావావేశాడు. ఒక్కసారిగా చుట్టుముట్టిన కష్టాలన్నీ పట్టాభిని పిచ్చివాడిని చేసినయ్. మనశ్శాంతి లేకుండా బాధపడ్డాడు. రాను రాను జరుగుబాటే కష్టమైంది. దాంతో బయటికి రావడం మానుకున్నాడు—ఎలా చూస్తాడు ప్రజల ముఖం ఈ పరిస్థితుల్లో ? ఆనాడు తన మంచిని కోరి చెప్పిన పెద్దలంతా ఈనాడు తన్ను చూసి నవ్వరూ! ఆనాడు వదినె, అన్నయ్య అన్నారంటే అందులోని విశాల భావాన్ని గుర్తించలేకపోయాడు. తన భార్యేగా తన్ను ప్రోత్సహించి, తరుముత. తనెంత తొందరపడ్డాడు. తన నాశనానికి కారణం తన భార్యేనని, ఆమెమీద మండిపడేవాడు. తత్ఫలితంగా ఆ దంపతుల్లో కలత లేర్పడినయ్—

ఆనాటిరాత్రి భోంచేసి భార్యతో పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ కూర్చున్న వెంకట్రామయ్యకు, కరణంవచ్చి చెప్పిన కబురు కంగారు పెట్టింది. క్రుంగిపోయాడు పాపం!

"ఈ సమయంలో విచారిస్తూ కూర్చుంటే ఎలా? ముందు కర్తవ్యాన్ని ఆలోచించండి వెంకట్రామయ్యగారూ?"

"ఏమాలోచించడం కరణంగారూ! మా కుటుంబంలో ఇలాంటి విప్లవం వస్తుందని కలలోకూడా అనుకోలేదు. పచ్చగా లక్ష్మీదేవితో కలకల్లాడే మా యిల్లు రెండుముక్కలయింది. వాడి నెత్తినేదో శనిదేవత కూర్చోకపోతే వాడింతటి తెగింపుకు ఎన్నడూ సిద్ధంకాడు."

"సరే అవన్నీ మాకు తెలీని విషయాలా అవి అలా వుంచండి. ఇప్పుడు మీవాడిని ఈ ఆపదనుండి సెట్లుకొచ్చే దెట్లా?"

"నేనేం చెయ్యను. ఇంత అకస్మాత్తుగా వచ్చిన ఆపదను, వాడి స్థితిని తలచుకొని విచారించడం కంటే."

కరణం ఆశ్చర్యపోయాడు. "వెంకట్రామయ్యగారూ! చిత్రంగా వుంది మీ ధోరణి. ఎంత చెడా మీ తమ్ముడేనా. గౌరవప్రతిష్టలుకల మీలాంటివారి కుటుంబంలో ఒక ప్రాణి ఇలాపేరు ప్రతిష్టలు లేకుండాపోవాల్సిందేనా. తప్పదు. మీరు కలుగ జేసుకోవాలి. తెల్లారేటప్పటికి వస్తా. శెలవ్" అంటూ సమాధానంకోసం ఎదురుచూడకుండా వెళ్లిపోయాడు

నడవలో కూర్చుని ఈసంభాషణంతా విన్న కాంతమ్మ "ఏమిటండీ అసలు విషయం ?" అంది.

"ఏముంది. తెల్లారితే మార్వాడీ వాడ్ని నడి బజార్లో అమ్మేటాడు." అన్నాడు. గతుక్కుమంది కాంతమ్మ, కన్నీళ్ల పర్యంతం అయింది.— "ఇంతవరకూవస్తే, నాకేం సమ్మంధంలేనట్లు మాట్లాడతారేం. పైవాడికున్నంత అభిమానమైనా మీకు లేకపోయిందా. తినడానికి మనింట్లో పిల్లా జెల్లా ? వాళ్లిద్దరికంటే మనకి ఆప్తులెవరూ ? మర్యాదపోయిం తర్వాత డబ్బుండీ ఏం లాభం? ఏం విలువ? పట్టాభి అల్లరిపడి వీధి పాలుకాడం మీకే కాదా?" అంది—

కాంతమ్మ వంక పిచ్చిగా చూశాడు వెంకట్రామయ్య. ఆమెహృదయం ఎంత ప్రేమమయం. అర్థం చేసుకోలేకపోయింది. కాని తన మరదలు. అనుకున్నాడు—

తెల్లారేటప్పటికి ఈవార్త ఊరంతా ప్రాకింది. వెంకట్రామయ్యా, కరణమూ కలిసి వెళ్లారు పట్టాభిరామయ్య ఇంటికి. ఆ మార్వాడీ అప్పటికప్పుడే వచ్చి కూర్చున్నాడు కోర్టువాళ్లతో. కరణం ద్వారా లెఖ్ఖలన్నీ సరిచూపించి, అయిన మొత్తం అయిదువేల చిల్లర వాడిముఖాన కొట్టి దయచేయమన్నారు.

సిగ్గుతోనూ, దుఃఖంతోనూ చచ్చివున్న పట్టాభిరామయ్యకు తొంగిమాడ్డానికైనా ధైర్యం లేకపోయింది. అతని అవస్థచూచి వెంకట్రామయ్య హృదయం ద్రవీభూతమైంది. "పట్టాభీ!" అంటూ చేతులు చాచాడు.

"అన్నయ్యా!" అంటూ కాళ్ళమీద పడ్డాడు పట్టాభి. మళ్లా ఇన్నాళ్లకి ఆ అన్నదమ్ము లిద్దరూ ఒకరి హృదయాని కొకర్ని హత్తుకున్నారు.

నాటితోనే ఆ అన్నదమ్ములూ, ఆ తోడికోడళ్ళూ ఏకమయ్యారు. పట్టాభిరామయ్య, రత్నం; కాంతమ్మ కాళ్ళమీద పడి కన్నీళ్లు కార్చారు. ఆనాటినుండి ఆ దంపతు లిద్దరూ దైవసమానులు.

"ఎంతైనా వాళ్ళిద్దరూ అన్నదమ్ములేగా. రక్తసంబంధం ఎక్కడకుపోతుంది" అన్నారా వూరి ప్రజ— ★

సీరియల్ నవల

# రెండు మహానగరాలు

చార్లెస్ డికెన్స్

## 14

డాక్టర్ మానెట్ 'సోహోస్క్వేర్'కు చేరువలో, ప్రశాంతమైన ఒక వీధి మొగిని, ప్రశాంతమైన ఒక భవంతిలో వుంటున్నాడు. ఆవేళ ఆదివారం. మధ్యాహ్నం దాటింది. హాయిగా ఎండకాస్తోంది. జర్విస్ లారీ, క్లర్ కెన్‌వెల్ ప్రాంతంలో వున్న తన ఆవాసంనుంచి బయలుదేరి, డాక్టర్ మానెట్ యింటికి వస్తున్నాడు. డాక్టర్ గారికీ, లారీకి బాగా స్నేహం యేర్పడ్డది. డాక్టర్ గారి యింటికి లారీ తరచు వస్తూవుండేవాడు.

సాధారణంగా, ఆదివారం నాడల్లా, లారీ, డాక్టర్ మానెట్ తోనూ, లూసీ మానెట్ తోనూ కలిసి షికారు వెళ్ళుతూ వుండేవాడు. కసరూ గత్రాపట్టి బయట తిరగటానికి వీల్లేకపోతే డాక్టర్ గారి యింట్లోనే వుండిపోయి యే గ్రంథకాలక్షేపంతోనో, బాతాఖానీతోనో ఖులాసాగా కాలం గడిపేసుకునేవాడు. ఆయనకు జీవితంలో కొన్ని ధర్మసందేహాలుండేవి; ఈ ఆదివారాల అవకాశాన్ని ఉపయోగించుకుని, డాక్టర్ గారి గృహనిర్వహణపద్ధతులను అవగతం చేసుకుంటూ తద్వారా సందేహనివృత్తి చేసుకుంటూ వుండేవాడు.

డాక్టర్ గారుంటున్న ప్రదేశంవంటి విచిత్రమైన ప్రాంతం, లండన్‌లో మరొకటిలేదు. డాక్టర్ వున్న భవంతి, సందుకు అడ్డంగా వుంటుంది ఇక ఆపైని అవతలికి వెళ్ళటానికి మార్గం లేదు. మేడమీది కిటికీలనుంచి తొంగిచూస్తే నిమ్మకు నీరెత్తినట్టున్న ప్రశాంతమైన వీధిదృశ్యం కనుపిస్తుంది. ఆ రోజుల్లో ఆక్స్‌ఫర్డ్ రోడ్డుకు ఉత్తరదిశగా యిళ్లుండేవి కావు; ఆ ప్రాంతమంతా అడివిచెట్లతోనూ ముళ్ళతీగెలతోనూ నిండివుండేది. చూట్టానికి పల్లెటూరి ప్రాంతంలా వుండేది. ఆనందయుతమైన చల్లటి ప్రదేశం; లండన్ వీధుల గల్లంతుల్లోనుంచి ఈ ప్రదేశానికి వస్తే—సముద్రగర్భంనుంచి రేవుకు జేరుకున్నట్టుగా వుంటుంది.

అదో పెద్దభవంతి; ఎక్కడా చలీ చప్పుడూ వినిపించదు. ఆ భవంతిలో డాక్టర్ మానెట్ రెండు అంతస్థులు ఆక్రమించారు. ఆ భవంతిచుట్టూ, గదిగదికీ ఒకొక్క 'సైన్‌బోర్డు' తగిలించివుంది. అనేక వృత్తులూ వ్యాపారాలూ జరుగుతున్న కేంద్రంగా కనుపించుతుంది. కాని ఆయా వృత్తులకు సంబంధించి, యే సంచలనం కనుపించదు. ఆ ఆవరణలో ముందున్న భవనానికీ వెనకవేపునున్న మరో చిన్ని భవనానికీ మధ్య విశాలమైన పెరటిదొడ్డి వుంది. ఆ పెరటిలో మధ్యగా పచ్చని ఆకులతో ఒక్కే ఒక చెట్టుంది. పెరటిలో వున్న ఆ చిన్ని యింటికి కూడా కొన్ని 'బోర్డులు' తగిలించివున్నయ్.

'హార్మోనియములు తయారు చేయబడును', 'వెండి కార్ఖానా', 'బంగారు కార్ఖానా' ఇత్యాదయః. వట్టిబోర్డులు మినహా ఆ కార్ఖానాల్లో ప్రాణిసంచలన మేమీ కనుపించదు. బంగారు కార్ఖానాగోడమీదమటుకు బంగారువర్ణంలో ఒక చెయ్యిమాత్రం చిత్రించివుంది. ఆ బంగారు చేతితాలుకు అదృశ్య భూతం ముందు తిన్నతాను కుత్తితో నలగగొట్టేసుకుని, అనంతరం అక్కడికొచ్చినవాళ్ళ నందర్నీ నలగగొట్టేసిందేమో! లేకపోతే ఇన్ని వృత్తులు సాగుతున్నట్టు 'సైనుబోర్డులు' కనుపిస్తున్నా మనుష్యులెవ్వరూ కనుపించకపోవటానికి కారణమేవిటి?

ఆ భవంతిలోనే డాక్టర్ మానెట్ వైద్యవృత్తిని సాగిస్తున్నాడు. ఆయన్ను అతఃపూర్వం యెరిగినవాళ్లు యెవరో కొద్దిమంది రోగులుమాత్రం వస్తూవుండేవారు. తన ఖర్చులకు కావలసినమటుకు ఏదో సంపాదిస్తూ వుండేవాడు.

ఈ సంగతులన్నీ జర్విస్ లారీకి తెలుసు. ఆయన మానెట్ గారి యింటిముందు కొచ్చి తలుపుకొట్టాడు.

'డాక్టర్ గారు ఇంట్లో వున్నారా?'—

'తిరిగొచ్చే వేళయింది.'

'లూసీమానెట్ వున్నారా?'

'ఆవిడా యిప్పుడే వస్తారు.'—

'మిస్ ప్రాస్?'—

మిస్ ప్రాస్ యింట్లోనే వుంది. కాని, మిస్ ప్రాస్ ఈ పెద్దమనిషిని యింట్లోకి రానివ్వమంటుందో వద్దంటుందో తెలీక ఆ దాసీమనిషి సందేహిస్తోంది.

లారీ చొరవచేశాడు; 'ఆవిడ యింట్లోనే వున్నట్టుంది—సరే నేను మేడమీదికి వెడతాను'—

నిజానికి డాక్టర్ కూతురుకు తన మాతృదేశం సంగతి యెక్కువగా తెలీదు. కాని ఫ్రెంచిపడుచు లందరికీ మల్లేనే, పెద్ద సిరిసంపదలు లేకపోయినా ఉన్నదాంట్లోనే, ఇల్లూ వాకిలీ ముచ్చటగా అలంకరించే చక్కటి అభిరుచిని అలవరుచుకుంది. ఇంట్లో వున్న సామాన్లు వగైరా పెద్ద ఖరీదుగలవేమీ గాదు; కాని అట్టే డబ్బు ఖర్చులేని చిన్నిచిన్ని అలంకారాలతో ఇల్లంతా ఎంతో శోభగాఉంది. ఎక్కడ యే పెద్దసామానుండాలో, యెక్కడ యే చిన్నిసామాను అమర్చాలో తీర్చిదిద్దినట్టు ఏర్పాటు చేసివుంది. లారీ వాటన్నిటివంకా చూస్తూ నిల్చున్నాడు. అక్కడున్న చిన్నిచిన్ని కుర్చీలూ, బల్లలూ, అతనివంక చూసి: 'మేమిక్కడ ఎంత పోగ్గా, కూర్చున్నామో చూశావా?' అంటున్నట్టుతోస్తోంది.

ఆ అంతస్తులో మొత్తం మూడుగదు లున్నయ్. మూడు గదుల్లోకి పరాహత్‌గా గాలివచ్చేలాగు తలుపులూ, దరవాజాలూ తెరిచి

అనువాదం: తెన్నేటి సూరి

వున్నయ్. ఆ గదుల చక్కదనాన్ని అభినందించుతూ లారీ ఒక గదిలోనుంచి రెండో గదిలోకి నెమ్మదిగా నడుస్తున్నాడు.

మొదటిగది అన్నిటికంటే బాగుంది. దాన్లో లూసీతాలూకు, ఫోటోలూ, పువ్వులూ, పుస్తకాలూ, కలర్ బాక్సులూ, ఈ వగైరా సరంజామా అంతా వుంది. రెండోది డాక్టరుగారు రోగులను పరీక్షించే గది. మూడోది డాక్టర్ పడకగది. మూడోగది కిటికీలోనుంచి చూస్తే దొడ్లోవున్న పచ్చనిచెట్టు కనుపిస్తూ వుంటుంది. ఆ గదిలో ఒక మూల డాక్టర్ మానెట్ చెప్పులుకుట్టుకునే పనిముట్లన్నీ ఒక బెంచీమీద పడేసివున్నయ్.

'ఆయన బాధపడిన రోజులనాటి ఈ స్మృతిచిహ్నాల నన్నిటినీ, డాక్టర్ గారు ఇంకా ఇలా చుట్టూ పేర్చుకు కూర్చోటం విచిత్రంగా వుంది' అన్నాడు లారీ.

'ఇందులో పెద్ద చిత్రమేవిటి?' అన్నది, మిస్ ప్రాస్; మిస్ ప్రాస్ అంటే ఆవేళ డోవర్లో, రాయల్ జార్జి హోటల్లో లారీగారిమీద లఘించిన ఆడసింహం.

'నేననుకున్న దేవిటంటే...' అంటూ నసిగేడు లారీ.

'అనుకున్నావులే మహాలావు!—'

లారీ తెల్లబోయాడు.

'కులాసాయేనా ?'

యోగక్షేమం విచారిస్తున్న ధోరణి చెవులబడి లారీకి ప్రాణాలు లేప్పరిల్లినయ్. "అమ్మయ్యా మరేం కోపంగా అన్నమాటగాదు" అనుకున్నాడు.

'ఆఁ కులాసాగానే వున్నా మీరు కులాసాగా ఉన్నారా?'

ఆ అదేకులాసా—నా మొహం కులసా ?'

'ఏవిటి సంగతీ'—

'సంగతేవిటి, గింగతి—చిట్టితల్లి సంగతి నాకెంత చిరాగ్గా వుంది ?'

'ఏవిటి చిరాకూ'

'ఏవిటేవిటి గేవిటి—చిట్టితల్లిని చూట్టానికి అడ్డమైన వెధవలూ డజన్ల తరబడి వస్తుంటే చిరాకా మరీనా ?'

'ఏవిటీ, డజన్లతరబడి వస్తున్నారా ?'—

'డజన్లేవిటి డజన్లు—వందలూ వేలూ—'

అందరి ఆడవాళ్ళలో మోస్తరుగానే, మిస్ ప్రాస్ లోకూడా అదో స్వభావం; తాను మొదట చెప్పినమాట గనక అవతలవాడు శంకించుతున్నట్టు తోస్తే ఆ విషయాన్ని మరింత పెంచి ఉత్ప్రేక్షించి పారేస్తుంది.

'అయ్యో బాబోయ్!' అన్నాడు లారీ, ప్రాస్‌కు కోపం వచ్చే, మరో మాటేమీ మాట్టాడే దమ్ములేక.

'ఇంత చిన్న బిడ్డగా వున్నప్పటినుంచీ చిట్టితల్లిని కనిపెట్టుకునున్నాను. చిట్టితల్లిని విడిచిపెట్టి క్షణమైనా వుండేదాన్నిగాదు—కష్టంగా వుండదు మరీ'

కష్టంగా యెందుకుండాలో లారీకి అర్థంకాలేదు. అర్థంకాలేదంటే యేవి (కొంప మునుగుతుందోనని 'అవున' న్నట్టు తల ఊపాడు.

'చిట్టితల్లి పాదా లంటుకోటానికి కూడా తగని వెంకటాయి వెధవలు ఊహూ ఇంటిచుట్టూ తిరుగుతూ వుంటారు—నువ్వు ఆ వ్యవహారం ప్రారంభించినప్పుడు...'

లారీ కుదుపుతిన్నాడు :

'ఆఁ యేవిటీ! నేనూ ప్రారంభించానా...'

'ప్రారంభించలా?—డాక్టర్ గారికి పునర్జన్మ నివ్వటానికి ఆ వ్యవహారంలోకి దిగలా'

'ఓహో అదా సంగతి—'

'ఆ వ్యవహారం నువ్వు పూర్తి చెయ్యటం, నిజంగా నాకు కష్టంగానే వుండేది. డాక్టర్ గారంటే నాకు కోపంగాదు. చిట్టితల్లికి తగినతండ్రి కాకపోయినా, మంచివాడే; కాని ఆయన కోసం పదిమందీ యింటికిరావటం, నా చిట్టితల్లి నాతో కూర్చుని

కాసేపు మాట్లాడటానికే అవకాశం లేకపోవటం—ఎంత కష్టంగా వుందనుకుంటున్నావ్'

మిస్ ప్రాస్ మనస్సులోవున్న ఈర్ష్య లారీకి అర్థమైంది. కాని ఆ ఈర్ష్యకు అట్టడుగున ల్యూసీమానెట్ పట్ల వున్న అనంతమైన వాత్సల్యాన్ని కూడా అవగతం చేసుకున్నాడు.

నువ్వు లక్ష చెప్పు, వెయ్యిచెప్పు చిట్టితల్లికి తగినవాడల్లా మా తమ్ముడు సాల్మన్ ఒక్కడుతప్ప మరొక డెవ్వడూ లేడు—వాడుకూడా ఒకలుచ్చా పనిచేసిన వాడేలే' అన్నది ప్రాస్.

దాంతో లారి, మిస్ ప్రాస్ 'వ్యక్తిగత జీవితాన్ని కొంత భోగట్టా చెయ్యవలసి వచ్చింది. ప్రాస్‌కు సాల్మన్ అనే తమ్ముడొకడున్నాడు. వాడు వ్యాపారం చేస్తానని ప్రాస్ దగ్గరున్న చిన్నం చితకా యావత్తూ కాజేసి జూదంలో తగలెట్టేశాడు. ప్రాస్‌ను దారిద్ర్యంలో వదిలేసి, తనకు కానట్టు తప్పుకున్నాడు. స్వల్పమైన ఈ తప్పిదంవున్నా సాల్మన్ సతీశీల సంప్రదాయాలు కలవాడేనని ప్రాస్‌వాదం. ఆ ఆడదాని మనస్థితిని అర్థంచేసుకుని లారీ విస్తుపోయాడు. ప్రసంగం మార్చి:

'ఇదిగో ఇటు చూడు! ఇక్కడ నువ్వూ నేనూ తప్ప మరొకరెవరూ లేరు—ఇద్దరం కూడా వ్యవహారజ్ఞానం వున్న తెలివిగల వాళ్ళం. నిన్నొకమాట అడుగుతాను చెప్పు—డాక్టరు తాను చెప్పులుకుడుతూ జైల్లోవున్న నాటి రోజులసంగతి అప్పుడప్పుడు కూతురుముందు ఎత్తుతూవుంటాడా'—

'చస్తే ఎత్తడు—'

'మరి, యీపనిముట్లన్నీ ఇక్కడ ఇలా ఎందుకున్నయ్'

'కూతురుతో చెప్పడన్నాను గాని—తను మనసులో ఆలోచిస్తూ వుండడన్నానా ?'—

'ఆయన ఆ విషయం ఆలోచిస్తూనే వుంటాడంటావా'—

'ఆఁ'

'నువ్వు ఊహించిందీ...'

'ఛీఛీ! నేనెప్పుడూ ఏదీ ఊహించను'—

'పొరపాటు నన్నాలే—పోనీ ఊహించలేదు—అనుకుంటున్నావ్—డాక్టర్ గారికి, ఆయన్ని జైల్లో పారేసిన వ్యక్తి పేరుగాని, జైల్లోపెట్టి బాధించటానికి గల కారణాలుగాని తెలుసునంటావా ?'

'ఆ సంగతి నాకేమీ తెలీదుగాని—చిట్టితల్లి ఏమంటుందంటే—'

'ఏమంటుందీ ?—'

'ఏమంటుందేమిటి—ఆయనకి అవన్నీ తెలుసునంటుంది'

'ఇదుగో యీ ప్రశ్నలన్నీ అడుగుతున్నానని మరేమీ అనుకోబోకు—నేను కాస్త మట్టిబుర్రని'—

'అట్టాగా మట్టిబుర్ర వేనా ?'—

'ఎబ్బెబ్బే! కాదులే—అసలు ఈ సంగతి ఎందు కడుగుతున్నానంటే, డాక్టర్ గారి సంగతి మనందరికీ తెలుసు ; ఆయన పాపిష్ఠి పనులేవీ చేసే స్వభావంగలవాడు గాడు—చేసివుండడు. పాపం అలాంటి అమాయకుణ్ణి యెందుకోమరి జైల్లోపెట్టారు—మాకిద్దరికీ ఎంతో స్నేహంవున్నా నాతో ఆయన యీ సంగతి యెప్పుడూ చెప్పలేదు—పోనీ కూతురుకన్నా చెప్పకుండా వుంటాడా అని అడుగుతున్నాను—మరేంలేదు విషయం తెలుసుకుందామని అడుగుతున్నాను'—

ఆ లాలనవాక్యాలతో ప్రాస్ కొంచెం మెత్తబడ్డది :

'ఏం చెబుతాడయ్యా!—ఆ సంగతి యెత్తితే ఆయనకు భయమేస్తుందల్లే వుంది.'

'ఏమిటీ ? భయమా ?'

'భయం గాదుటయ్యా—ఎలా మతిపోయిందో తెలియదాయిరి, ఎలా మతివొచ్చిందో తెలియదాయిరి. ఆ మాట తలుచుకుంటే మళ్ళీ యెప్పుడు మతిపోతుందోనని భయంగా వుండదూ.'

'అదే నే ననేది—ఆయన ఈ విషయాన్ని యెప్పుడూ మనస్సులో వుంచుకుని బాధపడుతూవుండటం మంచిది కాదేమో—అందుకే నిన్ను యీ విషయమై ప్రశ్నించవలసి వచ్చింది.'

'కర్మ అందుకేం జేస్తాం' అన్నది మిస్ ప్రాస్. 'మనం గాని ఆవిషయ మేదైనా కాస్త కదిలించామంటే ఆయన మరింత దిగులుగా దించుకుపోతాడు. మంచో చెడ్డో, ఆ సంగతి యెత్తకుండా వుంటమే నయం. ఒకోనాడు, ఆయన, అర్ధరాత్రివేళ పక్కమీదనుంచి లేచి గదిలో ఇటూ అటూ వెర్రిగా తిరుగుతూ వుంటాడు. ఆయనకు జైల్లోవుండే రోజులు జ్ఞాపకం వచ్చి వుంటాయని చిట్టితల్లి అంటూవుంటుంది. అల్లాంటప్పుడు చిట్టితల్లి లేచివెళ్ళి, ఆయన్ని వెంటబెట్టుకుని యిటూ అటూ తిప్పి కాస్త స్థిమితపడ్డ తరవాత మళ్ళీ తీసుకొచ్చి పడుకోబెడుతుంది. ఆయన మాత్రం, తన మనస్సు యెందుకలా ఆందోళనగా వున్నదీ రవ్వంతేనా చెప్పడు. ఆ సంగతి ఆయన్ని కదిలించటం మంచిదిగాదని చిట్టితల్లి అంటుంది. ఆ సంగతి యేమీ యెత్తకుండా, వెంటబెట్టుకుని యిటూ అటూ తిప్పి బుజ్జగిస్తుంది. ఆయన మళ్ళీ ప్రజల్లో పడతాడు.'

ఇంతలోనే మెట్లమీద అడుగులచప్పుడు వినిపించింది: 'అరుగో వస్తున్నారు' అంటూ, మిస్ ప్రాస్ చివాల్న లేచింది—'ఇక చూసుకో వందలూ వేలూ వచ్చిపడతారు.'

లారీ కిటికీలోనుంచి తొంగిచూచాడు. ల్యూసీ మానెట్ తండ్రిని వెంటబెట్టుకుని మేడమెట్లెక్కుతోంది.

ల్యూసీ లోపలికి రాగానే మిస్ ప్రాస్ చేతినిండా పని కల్పించుకుని హడావిడి చేస్తోంది. ల్యూసీ నెత్తిమీదవున్న 'బానెట్' తీసి దుమ్ము దుట్టా దులిపేసి అతిజాగ్రత్తగా బల్లమీద వుంచింది. పైన కప్పుకున్న శాలువతీసి జాగ్రత్తగా మడిచి అక్కడపెట్టింది. దువ్వెన్న తీసుకొచ్చి ఆ బంగారుజుట్టును అతి ఆప్యాయంగా దువ్వి సరిజేస్తోంది. చిట్టితల్లి కూడా ముద్దముచ్చటగావుంది. మిస్ ప్రాస్‌ను అతి ఆప్యాయంగా కౌగిలించుకుని తనకోసం అంతశ్రద్ధ తీసుకోవట మెందుకని మారాం చేస్తోంది. డాక్టర్ కూడా సర్దాగా వున్నాడు. ఆ యిద్దరివంకా చూస్తూ: 'అతి గారాబంచేస్తూ ల్యూసీని చెడగొడుతున్నావ్' అని ప్రాస్‌ను మందలించుతున్నాడు. ప్రాస్‌ను మందలించుతున్నాడన్న మాటేగాని, పితృవాత్సల్యం తొణికిసలాడుతున్న ఆయన కళ్ళవంక చూస్తే, ల్యూసీ అంతకంటే పదిరెట్లు చెడిపోయేట్టుగా వుంది. ఆ ముగ్గురివంకా చూస్తూ లారీ కూడా సంతోషంగా నే వున్నాడు. ఘోటక బ్రహ్మచారిగావున్న అతనికి, ఆ వార్థక్య దశలో ఒక కుటుంబంతో కాలక్షేపంచేసే అవకాశం కలగటం అదృష్టం కాదూ ? పైపెచ్చు ప్రాస్ జోస్యం చెప్పినట్టు వందలూ వేలూ వచ్చిపడే ప్రమాదంకూడా యేమీ కనుపించటం లేదు.

భోజనంవేళకూడా సమీపించింది—అప్పటికీ కూడా వందలూ వేలూ ఎవ్వరూ రాలేదు. భోజనం యేర్పాట్లలో మిస్ ప్రాస్ నిమగ్నురాలై వుంది. భోజన పదార్థాలన్నీ అటు ఫ్రెంచి సాంప్రదాయానికీ ఇటు ఆంగ్ల సాంప్రదాయానికీ మధ్యేమార్గంలో వున్నయ్. సోహో ప్రాంతమంతా గాలించి, మిస్ ప్రాస్ కొంతమంది ఫ్రెంచివాళ్లను పట్టుకొని, వాళ్ళకి అణా, బేడా పారేసి, ఫ్రెంచిపాకశాస్త్ర విజ్ఞానాన్ని అస్తవ్యస్తంగా ఆర్జించు

(37—వ పేజీ చూడండి)

# బొమ్మరిల్లు



## బాబుచెప్పిన జవాబు

శ్రీమతి కోట దుర్గాభవాని

చిన్ని బాబు లందరు కలసీ
గలగల మంటూ అల్లరితో
ఉన్నారొక పాఠశాలలో
మాష్టరు గారంతట్లో
లోపలికొచ్చి కూర్చోగా
నిశ్శబ్దంగా క్లాసంతా
వాన వెలిసి నట్లైంది.
పాఠం చెబుతూ మాష్టారు
సరదాకోసం ప్రశ్నొకటి
కుర్రల నందరి నడిగారు.
"పిల్లల్లారా మీరంతా
ఆలోచించీ చెప్పండి.
ఇప్పుడు వున్నది—
ఇరవైవేళ్ల క్రితం లేనిది
ఏదైనా ఒకటి చెప్పండి."
కుర్రల బుర్రల కంతా
పని కల్పించిన మాష్టరు
దానికి జవాబును తనలో
తానాలోచించ సాగాడు.
చాలాసేపు నిశ్శబ్దంగా
చడీ చప్పుడూ లేకుండా
ఉన్నారా పిల్లలంతా.
ఇంతలో కుర్రాడొకడు
లేచి నిడివిగ నిలిచాడు
ఏమిటా జవాబను కుంటూ
అందరు ఆదిశ చూశారు.
జంకూగొంకూ లేకుండా
కుర్రడు లేచి నిల్చుని
"మేమే" నని కూర్చున్నాడు.
అర్థం అయిన కుర్రలంతా
గొల్లుమని నవ్వారు.
అర్థంగాని మాష్టరు మాత్రం
తెల్లముఖం వేశారు.



# శాస్త్రుల్లవారి సమర్థింపు

అనగనగా ఒక వూళ్లో ఒక జమీందారు గారు వుండే వాడు. ఈయనకు జ్యోతిషం అంటే విపరీతమైన నమ్మకం వుండేది. పంచాగం అంటే వల్ల మాలిన పట్టుదల వుండేది. మాటి మాటికీ జ్యోతిషం తెలిసిన వారి కోసం వెదుక్కుంటూ పోవటం దేనికని, జ్యోతిషం బాగా తెలిసినట్లుగా పేరుపొందిన ఒక శాస్త్రుల్ల గారిని తీసుకువచ్చి తన కొలువులోనే అట్టేపెట్టుకొన్నాడు. ఆ శాస్త్రులగారికి నిజంగా జ్యోతిషం అట్టే తెలియక పోయినా, తనంత తెలిసినవారు మరెవ్వరూ లేరంటూ అందరినీ బుకాయించేసే వాడు. అంత మరీ గడ్డు పరిస్థితి వచ్చినప్పుడు తనబుద్ధిని వుపయోగించి యుక్తిగా తప్పించుకోనే వాడు.

ఆ జమీందారు గారికి సనాతనాచారి అనే ప్రాణ మిత్రుడు ఒకడు వుండేవాడు. ఆయన తన పేరుకు పట్టి వ్యతిరేకంగా చాలా అనాచారంగా వ్యవహరించే వాడు. అంటే పంచాగం, జ్యోతిషం యిలాంటి వాటిలో అతడికి పిసరంతైనా నమ్మకం వుండేది కాదన్న మాట. జమీందారు మాత్రం యితనిని అప్పుడప్పుడు యిలాంటి విషయాలలో నమ్మకం లేనందుకు మందలిస్తుండే వాడు.

సిహెచ్. అప్పారావు

ఒకరోజున జమీందారు గారు ప్రభుత్వానికి శిస్తుపైకం చెల్లించవలసి వచ్చింది. డబ్బు కట్టటానికి బయలుదేరే ముందు శాస్త్రుల గారిని అడిగి మంచి ముహూర్తం పెట్టించుకొని మరీ బయలుదేరాడు; గుర్రంమీద. దురదృష్ట వశాన దారిలో ఆగుర్రం బెదిరి జమీందారు గారిని క్రింద పడతోసింది. కాలికేమో బాగా దెబ్బ తగిలింది! గుర్రానికేమో పెద్ద బొప్పి కట్టింది.

జమీందారు గారు యింత హంగామా చేసి మంచి ముహూర్తం అంటూ పెట్టించి శుభమా అని బయలు దేరితే జరిగింది, యిలా అస్తవ్యస్తంగా వున్నదా! ఆ సనాతనా చారి ఏం చేశాడో తెలుసా? తన జాతకరీత్యా దుర్ముహూర్తం ఏదో సరిగ్గా అదే ముహూర్తంలో పెద్ద పనిమీద బయలు దేరి వెళ్లాడు. మరి అది ఏమి విచిత్రమో - ఆ సనాతనా చారికి దారిలో బోలెడంత డబ్బు దొరికింది. ఈ విషయం తెలియరాగానే జమీందారు గారికి అరికాలిమంట నెత్తికెక్కింది. అంతసేపు కూచొని మేషాలు లెక్కపెట్టి ముహూర్తం పెట్టినా తనకు వెళ్లినపని కాక పోగా, కాలుఅవుడు అయింది. ముహూర్తాలు, గిహూర్తాలు ఏమీ చూచుకోకుండ దురుసుగాపోయిన తన మిత్రుడికి యింత లాభించింది. అసలు లోపమంతా ఎక్కడ వున్నదో తెలుసు కొందామనే

(30-వ పేజీ చూడండి)






# డాన్ క్విక్‌సెట్

['సెర్వాన్‌టిజ్' అనే స్పానిష్ రచయిత 1605—1615 సంవత్సరాల మధ్యకాలంలో డాన్ క్విక్‌సెట్ అనే పేరుతో ఒక నవలను రచించాడు. అప్పటి సంఘంలో 'నైట్స్' (వీరులు) అనే ఒక వర్గంవారికి అపరిమితమైన గౌరవం వుంటూవుండేది. ఈ 'నైట్స్' ధర్మరక్షకులని ప్రజలు విశ్వసించేవారు. యదార్థంగా 'నైట్స్' అనిపించుకొనేవారు ఎంత పనికిమాలిన వ్యక్తులో ప్రపంచానికి చాటాలన్న తలంపుతోనే సెర్వాన్‌టిజ్ యీ రచన కొనసాగించాడు. ఇందులో డాన్ క్విక్‌సెట్ అనే వెర్రి వెంగళప్ప తానూ ఒక వీరుణ్ణని నమ్మి ఏవేవో సాహసకార్యాలు చేయ పూనుకొంటాడు. అతడు చేయబోయిన ప్రతి సాహస కార్యంలోనూ అతనికే చావు తప్పి కన్ను లొట్టపోయినంతపని అవుతుంది. ఆలోచన లేకుండా చేసే పనులను గురించి చెప్పదలచి వచ్చినప్పుడు యింగ్లీషులో 'క్విక్ సాటిక్' అంటూవుండటం యిప్పటికీ మామూలే. డాన్ క్విక్‌సెట్ మీదుగా వచ్చిన పదమే యీ క్విక్ సాటిక్.]

దాదాపు నాలుగువందల ఏండ్లపాటు ప్రపంచ వాఙ్మయంలో నిలచివుండి అసంఖ్యాకమైన పాఠకలోకాన్ని అలరింప చేసిన యీ గ్రంథం మా యీ ప్రయత్నంద్వారా ఆంధ్ర ప్రజానీకానికి కూడా అందుబాటులోకి రాగలదని ఆశిస్తున్నాం:

## 1

లామంచా అనే ఒక గ్రామంలో సామాన్య కుటుంబీకుడు ఒకాయన వుండేవాడు. ఆయన పేరు డాన్ క్విక్‌సాడా.

ఈయనకు పెళ్లీ పెటాకులూ ఏమీ కాలేదేమో; పొద్దస్తమానం పుస్తకాలు ముందు వేసుకు కూర్చొనేవాడు. దానికితోడు ఆయనకు ఏవుద్యోగమూ లేదు కూడాను. ఆయన చదివిన పుస్తకాలైనా ఎటువంటి వనుకొన్నారు? అన్నీ వీరులు, మహావీరుల గాథలు. ఆలాగు ఎడతెరిపి లేకుండా ఈ వీరుల గాథలన్నీ చదివి చదివి తల కెక్కించుకొనే సరికి అతనిలో వింత ప్రకృతి ఒకటి బయలుదేరింది. అహర్నిశలూ యీ వీరుల జీవితగాథలు తలపోసి వున్న మీదట తానూ ఒక వీరుడుగా తయారు కావాలనీ, తన పేరుకూడా ఆ మహావీరుల పేర్లతోపాటు ఆ చంద్ర తారకంగా నిలచిపోవాలనీ కలలు కన్నాడు. కలలు కనటంతో ఆగాడా? ఎబ్బే. ఆ పుస్తకాలలో వర్ణించిన విధంగా తానుకూడా దుష్టశిక్షణకు శిష్టరక్షణకు, కంకణం కట్టుకొన్నాడు. ఆమాదిరి దీక్షను ఎప్పుడైతే తీసుకొన్నాడో వెంటనే బయలుదేరాడు; వీరుడుగా వ్యవహరించటానికి కావలసిన సరంజామా అంతా సమకూర్చుకోవటానికి. వాళ్ల యింట్లో అటకమీద తాతముత్తాతలనాటి కవచం ఒకటి తుప్పుపట్టి తున్నది. పనిగట్టుకు అటకమీదికి ఎక్కి దానిని కిందికి దించి వీలైనంత మటుకు దానితుప్పు వదిలించాడు. ఎక్కడికక్కడ వూడిపోతున్న ఆ కవచం తాలూకు బందులన్నిటినీ తంటాలుపడి అతికించాడు. కిర్రు కిర్రు లాడుతున్నా కవచం మటుకు పనికి వస్తుందని పించింది కానీ, తలమీద పెట్టుకొనే వుక్కుటోపీ వున్నదే—అది తన తలకు చాలా పెద్దది అయింది. అసలు అందులో సగభాగం వూడిపోయి ఎక్కడవున్నదో ఎంత వెతికినా కనిపించనే లేదు. కనిపించకపోతే పోయిందని, వున్నమటుకు ఆటోపీనే అట్టముక్కలూ సీనారేకు ముక్కలూ అవీ అంటించి ఎలాగు ఓలాగో దాని ఆకారం తేల్చాడు. ఇకపోతే కావలసింది ఒక మంచి గుర్రం. తనదగ్గిర ఒక గుర్రం అయితే వున్నది కానీ అది మంచిదనటానికి వీలులేదు. ఏమంటారా?— దానికి దాదాపు వీళ్ల తాతయ్యకు వుండే వయస్సు వుంటుంది. దానిని ఒక్కసారి చూసిన వారికి ఎవరికైనా సాధారణంగా గుర్రం వంట్లో ఎన్ని ఎముకలు వుంటాయో యిట్టే తెలిసిపోతుంది. గుర్రం ముసలిదైతే అయింది. వీరుడైనవాడు యివన్నీ చూస్తూ కూర్చుంటే వాడు వీరుడెప్పటికి ఔతాడు? ఎలా అవుతాడు? అందుకని ఆగుర్రాన్నే వీరోచితమైన వాహనంగా ఆయన పరిగ్రహించాడు. సాధారణంగా ప్రతివీరుడూ తన గుర్రానికి ఏదో ముద్దుపేరు పెట్టు

అనువాదం: శ్రీ విశ్వాత్ముల నరసింహమూర్తి

కొంటాడుగా. అందుకని తానూ తన గుర్రానికి 'రోజి నాన్‌టే' అనే పేరు పెట్టాడు. ఆ పేరుతో తన గుర్రాన్ని పిలుస్తుంటే అందులో ఆతని చెవులకు ఎన్నోరకాల సంగీతం వున్నట్లు వినిపించేది. గుర్రానికి పేరుపెట్టిన శుభముహూర్తాన్నే 'డాన్ క్విక్‌సాడ' అనే తన దేశవాళీ నామధేయాన్ని కాస్త విన సొంపుగా వుండాలనే వుద్దేశంతో 'డాన్ క్విక్‌సెట్‌గా' మార్చేసుకొన్నాడు.

అమ్మయ్య! ఇప్పటికి తనకు వీరుడికి వుండ వలసిన అన్ని లక్షణాలూ ఏర్పడ్డాయి. (కాకపోతే— కిర్రు కిర్రు మంటుంది కానీ) ఒక మంచికవచం వున్నది. (తలకు పెద్దదైంది కానీ) ఒక వుక్కుటోపీ వున్నది. (అన్నట్లు యీటోపీ పెట్టకొన్నప్పుడల్లా అది పడి పోకుండా నుదుటికీ తలకు చుట్టూతా తుమ్మ జిగురుతో అంటించుకోవాలి.) (అట్టే దూరం పరుగెత్త లేదు కానీ) చక్కని గుర్రం కూడా వున్నది. మంచి యీ పేరు కూడా దొరికింది. తనపేరు ఎంత చక్కగా ముద్దు వచ్చేట్లుగా మారిందీ! ఇహపోతే వున్న కొరతల్లా ఒక్కటే. ప్రతివీరుడి కథలోనూ ఒక అమ్మాయి వుంటూ వుంటుంది. ఆ అమ్మాయి పేరు తలుచుకొనే ప్రతివీరుడూ అంతంత సాహసకార్యాలు చేసేవాడు. మరి తనకు అలాటి అమ్మాయి ఎవరూ లేదే? ఏ అమ్మాయి లేకపోతే తనేం సాహసకార్యాలు చేయ గలడు? ఏమిటి చెయ్యాటం అని ఆలోచించాడు. తెగ ఆలోచించాడు. అసలు అలాటి అమ్మాయి వుంటేనే కాని కథసాగదు. తను ఏపని చేసినా ఆ అమ్మాయి కోసమే చెయ్యాలి. ఒక్కొక్క యుద్ధంలో తాను విజయ చిహ్నంగా సంపాదించిన శత్రువుల కత్తులు, తాను నరికిన శత్రువుల తలకాయలు వీటి నన్నిటినీ తాను ఏకాయకిని తీసుకువెళ్లి ఆమె పాదాలముందు

నజరానాలుగా పడవేయాలి కదా? అసలు—ఓ అమ్మాయి అంటూ వుండి, ఆ అమ్మాయిపేరు అలా తన మనస్సులో ఎల్లప్పుడూ ఆరని దీపంలా వెలుగుతూ వుంటేనే కదా తనచేతికి శక్తి, తన కత్తికి పదునూ వచ్చేది? పెద్ద చిక్కేవచ్చి పడింది. తాను యింతవరకు ఎరిగివున్న ప్రతిస్త్రీని గురించి మనస్సులో సుదీర్ఘంగా చర్చించుకొన్నాడు. వారిలో ఏ ఒక్కర్తెకీ తన హృదయాధి దేవత కాగల అర్హతవున్నట్లు అతనికి తోచలేదు. అయితే మాత్రం? తను అంతట్లో వెనక్కి తగ్గేమనిషా? అలాటి స్త్రీమూర్తిని సంపాదించి తీరుతానని ప్రతిజ్ఞపట్టాడు. మనస్సులో యీ అభిప్రాయం అట్టేపెట్టుకొని తనవూరి చుట్టుప్రక్కల వున్న గ్రామసీమలన్నీ గాలించాడు. అలా తిరగగా, తిరగగా చివరకు అల్లంతదూరాన పోతున్న ఒకానొక స్త్రీమూర్తి యీతని హృదయంలో హత్తుకొన్నది. భేష్. ఈమె ఆకారం అదీ, తాను యింతవరకూ కలలు గంటున్న స్త్రీమూర్తికి సరిపోలుతున్నది. ఆమెకు తను 'డల్‌సీనియా' అనేపేరు పెట్టుకొన్నాడు. పేరైతే కవిత్వంలో వుండే పేరుల్లాంటిదే పెట్టాడు కానీ ఆమెకు పెద్దహోదా అదీకూడా వుండాలి కదా? అందుకని ఆమెకు ఒక పెద్ద రాజకుమార్తె హోదా వున్నట్లే తాను ఒప్పేసుకొన్నాడు. పాపం ఆపల్లె పడుచుకు యీ గొడవ అంతా ఏమీ తెలియకుండానే డాన్ క్విక్‌సెట్ ధర్మమా అని, ఓ రాకుమార్తె అయి కూర్చొంది (ఆవిడపేరు మనం పలుకవలసి వచ్చినప్పుడల్లా 'లేడీ డల్‌సీనియా' అని గనుక అనక పోయామో—వీర శూరాగ్రేసరుడు డాన్ క్విక్‌సెట్ గారికి మాంచి కోపం వచ్చేస్తుంది.) సరే—తను వీరుడు కావటానికి వున్న ఆ ఒక్క కొరతకూడా తీరిపోయింది. అతని మనస్సు సంతోషంతో పొంగిపోయింది. దూరంగా కదలిపోతున్న ఆ స్త్రీమూర్తిని వుద్దేశించి డాన్ క్విక్‌సెట్ తనలోనే తాను యిలా అనుకొన్నాడు.

"ఓ అందాలరాసి; ముత్యాలకోవా! త్రుటి మాత్రంబున యీ వీరుని మానసంబును కొల్లగొట్టితివి కదా! నాహృదయసీమకు నీవేకదా రాణివి. ఈ భూతలముపై జరుగు నన్యాయముల దొలగింపుమని నాకు ఆజ్ఞయిచ్చి, యీ దీనుని నీసమక్షమునుండి తొలగించు చుంటివా? సరే. నీమనోజ్ఞరూప లావణ్యములకు బందీ నయిన నేను నీ ఆజ్ఞనుపాలించి దుష్టశిక్షణ, శిష్టరక్షణ ఒనరించి, నీమెప్పు నొందెదనుగాక."

(తాను చదివిన ప్రతివీరుని గాథలోనూ ఆయా వీరులు యీ మాదిరి భాషనే ఉపయోగించి వున్నందువల్ల, తనుకూడా యీ మాత్రం గొప్పగా మాటలు ఏరి కూర్చినందుకు తనను తానే డాన్ క్విక్‌సెట్ అభినందించుకొన్నాడు.)

వీరుడు కావటానికి అన్ని హంగులూ ఏర్పడ్డాయన్న దిలాసాతో డాన్ క్విక్‌సెట్ ఆరోజు రోజు

అంతా కుంటిగుర్రం ఎక్కి తెగతిరిగాడు. కానీ తన ధైర్య సాహసాలను ప్రకటించు కొనేందుకు ఏవిధమైన అవకాశమూ రాలేదు. ఆ పుస్తకాలలోని వీరుల కందరికీ బయలుదేరటమే తడవుగా ఏదో పెద్ద రాక్షసి ఎదురు అవటమూ, ఆ రాక్షసితో యీ వీరుడు హోరా హోరీ కత్తియుద్ధం చేసి, వాడిని హత మార్చి, అంతవరకు ఆ రాక్షసిచేతిలో చిక్కి హింసించబడుతున్న అపూర్వ సుందరి విముక్తి జరిగినట్లుగా వర్ణించబడి వున్నదే. నాసికా రంధ్రాల నుంచీ నిప్పులు చెరిగే భయంకర మృగమైనా కనీసం తనకంటపడి వుంటే, తన పదునైన కత్తితో యిట్టె దాని గొంతుకోసి తనచేతి దురద యింత తీర్చుకొనే వాడుకదా! అదీ కనుపించలేదు. తనంతటి వీరుడు సాహసకృత్యాలు చేయటానికి సిద్ధమైతే, చేసేందుకు పని ఏదీ దొరకకపోవటమేమిటని అతనికి బలే చిరాకు పుట్టుకొచ్చింది. అయినా సరే ఆగకుండా పూరికే ఆగుర్రమెక్కి తెగ తిరిగాడు. చీకటి పడవచ్చే సమయానికి తనూ, తన గుర్రం 'రోజినాన్టీ' కూడా బాగా అలసిపోయారు. ఈ వేళకు చెప్పుకోదగిన సంఘటన ఏమీ జరుగదు కాబోలని క్విక్ సెట్ నిరుత్సాహ పడ్డాడు కూడాను. ఇంతలో అల్లంత దూరాన రోడ్డు మలుపులో ఒక హోటలు కనిపించింది. ఆహోటలు గుమ్మంలో యిద్దరు పల్లెటిదిక్కు ఆడవాళ్లు నిలబడి వున్నారు. ప్రక్కనే వున్న పొలంలో పందులు కాచుకొనే మనిషి ఒకడు తన మందను మళ్లేసుకోవటాని కని కొమ్ముపూధటం మొదలు పెట్టాడు.

ఏదో పెద్ద పొడిచెయ్యాలని వుబలాట పడుతున్న డాన్ క్విక్ సెట్ కు ఆ హోటలు ఒక పెద్దకోట అయినట్లు, ఆకోట గుమ్మంలో నిల్చునివున్న యిద్దరు ఆడవాళ్లు యిద్దరూ గొప్పవంశ లో పుట్టిన స్త్రీరత్నాలైనట్లు, వారివద్ద పహరాకై నిలబడివున్న ఆమరిగుజ్జు వున్నాడే- వాడు డాన్ క్విక్ సెట్ వంటి వీరశూరాగ్రేసరుని రాకను తెలియపరుస్తూ చహరా వేసినట్లూ తోచింది. డాన్ క్విక్ సెట్ తన మనసులో యిన్ని వూహాలు చేస్తున్న యీ సమయంలోనే ఆ పల్లె పడుచు లిద్దరూ యీసుకుపోయిన ఆగుర్రం మీద యీడాలు, డవాలు తగిలించుకొని వస్తున్న మనిషిని చూడటం తటస్థించింది. అసలే మసక మసకగా చీకటి పడుతున్న దేమో, వాళ్లిద్దరూ యీవింత ఆకారాన్ని చూచి భయపడిపోయి కెవ్వున కేక వేసిపారిపోబోయారు. వాళ్లు హోటల్లో దూరబోయేలోగా డాన్ క్విక్ సెట్ వాళ్లదారికి అడ్డంవచ్చి నిలుచుని "భీత హరిణేక్షణలారా! బేలలైయిటు పారిపోయెద రేల? నేను వీరుల వర్గమునకు చెందినవాడను. వీరులైన వారెవ్వరునూ మిముబోలిన వుత్తమవంశ సంజాతలకు కీడుచేయదు రే? భయపడవలదు; భయపడవలదు." అంటూ అభయ హస్త మెత్తాడు. ఆపల్లె పడుచులకు యీ పెద్దమనిషి ఆకారం, ఆయన తొడిగిన ఆ తుప్పుకవచం, తుమ్మ జిగురుతో అంటిచుకొన్న ఆ వుక్కుటోపీ వీటన్నిటికీ తోడు, నాటకాలలో మాదిరిగా యీ సంభాషణ శైలి యివన్నీచూస్తే చమత్కారంగా తోచింది. ముష్టి ఎత్తుకొనే తమను పట్టుకొని యీయన వుత్తమ వంశ సంజాత లనటంతో మరీ నవ్వువచ్చి, పగలబడి నవ్వటం మొదలు పెట్టారు. ఈ యిక యికలు, పక పకలు చెవినిపడ్డ హోటలు యజమాని, అసలు విషయం ఏమిటో అని గబగబా పరుగెత్తు కొంటూ వచ్చాడు. అతని శరీరం కొంచెం స్థూలమేమో, పరిగెత్తటం చేతకాక దొర్లుకొంటూ దొర్లుకొంటూ వచ్చాడు. వచ్చినవాడు ముట్టె దించుకుపోయిన ముసలి గుర్రంమీది యీ బుట్టబొమ్మను చూచి, ఆతడు మాట్లాడే ఆధోరణిచూచి, తనకూ నవ్వు వచ్చింది. ఎంతకైనా వ్యాపారంచేసే మనిషి కదూ! పైకి పొంగి వస్తున్న నవ్వు అణచివేసుకొని తనుకూడా డాన్ క్విక్ సెట్ భాషనే అనుకరిస్తూ.

"హే వీరాగ్రేసరా! తమకిదే మా స్వాగతంబు; సుస్వాగతంబు. రండు. ఒకింత విశ్రమించి మేమీయగల అల్పాహారంబుల సేవించి సేదదీరుడు." అన్నాడు. ఆహోటలు యజమాని తనకిచ్చిన స్వాగతానికి డాన్ క్విక్ సెట్ ఎంతో ఆనందించాడు. ఆ హోటలు యీయన కంటికి కోటలా కనుపిస్తున్నది కనుక దాని యజమానిని ఆకోటకు గవర్నరుగా యీయన గుర్తించాడు. అట్టి గవర్నరుగారి పట్ల గౌరవభావం ప్రకటించాలనే ఆలోచన రాగానే డాన్ క్విక్ సెట్ గుర్రం మీంచి చప్పున దిగాడు. హోటలు యజమాని (కాదు

సీలుఆన్సరు
మద్రాసు
ప్రీమియర్‌బాంకిలో

బహుమతి రూ 10,000

MURALI CROSS WORDS
మురళి 1, 2, క్రాసువర్డ్సు
GOVT REGD NO 1894

ముగింపుతేది
20-6-52

వరుస 1 కి
నాలుగు
అణాలు

మొదటి బహుమతి రూ. 7000

MURALI

ఇతర బహుమతి రూ. 3,000

| | ముగింపు తేది 20-6-52 (సిలు ఆన్సరు మద్రాసు ప్రీమియర్ బ్యాంకిలో) | జవాబులు 1 | 2 |
|---|---|---|---|
| 1 | మా మురళి క్రాసువర్డ్సుకు ఉదాత్తమైన——కోరుచు పోటీదారులు ఉత్తరాలు వ్రాస్తున్నారు | ఆశీస్సు | ఆయుష్షు |
| 2 | స్త్రీయొక్క——కు ఎంతమంది పురుషులు బందీకృతులు కాలేదు! | ప్రేమలత | వాచాలత |
| 3 | అమాయకుడైన పురుషుడు ఎక్కువగా ఇలాంటి స్త్రీని అభినందించును | రూపవతి | మానవతి |
| 4 | గత యెన్నికలలో నాయకులు కొంతమంది ఇలాంటి ప్రతిజ్ఞలకు వెనుదీయలేదు | నాటకము | బూటకము |
| 5 | సున్నితమైన మనస్సుగలవారు దీని బాధను సహించలేరు | కలహము | విరహము |
| 6 | భర్త ఇలాంటివాడయిననూ అతనిని గౌరవించిన సతి ఓర్మి ప్రశంశనీయము | ముక్కోపి | కురూపి |
| 7 | గౌరవముగల స్త్రీ తన——ను ఎన్నడూ చులకన చేయదు | మెట్టినిల్లు | పుట్టినిల్లు |
| 8 | కొంతమంది యేపని చేయుటకైనను ముందు——తో బాధ పడతారు | అవమానము | అనుమానము |
| 9 | సంతతి లేక పోవుట సతీపతులకు——కలిగించవచ్చును | వివాదము | విషాదము |
| 10 | దీనికి అలవాటుపడిన ఆడుదానిని అరికట్టుటకు యెవరికీ సాధ్యంకాదు | జారత్వము | చోరత్వము |
| 11 | ప్రస్తుతము మన దేశములో ఇది కొరవడినదని కొంతమంది అభిప్రాయము | దేశభక్తి | దైవభక్తి |
| 12 | పెద్ద——ను జూచి పిల్లలు పెద్దలుకూడ ఆనందించెదరు | తటాకము | పతాకము |
| 13 | చిన్నపిల్లలు చూచిన వస్తువు కావలెనని——చేెందుదురు | ఆరాటము | ఆర్భాటము |

మీ జవాబులు ఈ ఇండ్లయందు 1, 2 మూలముగా పూర్తి చేయుడు

| |
|---|
| 1 |
| 2 |
| 3 |
| 4 |
| 5 |
| 6 |
| 7 |
| 8 |
| 9 |
| 10 |
| 11 |
| 12 |
| 13 |

పైనుండి క్రిందవరకు జవాబుల వరుస 1 కి 4 అణాలు మాత్రం రూపాయికి 5 వరుసలు పూర్తి చేయుడు

14 వ పోటీ సీలు ఆన్సరు
1 1 2 2 2 2 1 2 2 2 2 2 2
ఈ 17 వ పోటీయందు 7/- (యేడు రూపాయలు) కాని అంతకుపైగా కాని పోటీచేయు ప్రతి కాంపిటీటరుకున్ను స్పెషల్ బహుమతి కలదు.

పేరు..................................................................................................

అడ్రసు..................................................................................................

P. O. or M. O. No.........Col No.........మొత్తము రూ........ మొత్తం వరుసలు...C. V. No...............

In entering the Competition I agree to abide by the Competition Rules & Conditions and to accept the Competition Manager's decision as final and legally binding.

**No. 17**

*Address Entries to:* **MURALI CROSSWORDS, PALMANER.** (CHITTOOR DIST)

కాదు---గవర్నరు గారు) డాన్ క్విక్ సెట్ గారి గుర్రాన్ని పశువుల కొష్ఠంలోకి నడిపించుకు వెళ్లాడు. డాన్ క్విక్ సెట్ ఆ యిద్దరు అంగనల వైపుకు తిరిగి తనవంటిపైగల కవచం వగైరా సామాను సెంపాదిగా వలిచిపెట్ట వలసిందిగా కోరాడు. వారిద్దరూ కూడా యీ తమాషాకు లోలోపల నవ్వుకుంటూ, అందుకు వుపక్రమించారు. కవచమూ, కాలికి వేసిన తొడుగులు తీసివేశాక వాళ్ళిద్దరూ కలిసి నెత్తిమీది వుక్కుటోపీని వూడదీయ బోయారు. ఆటోపీకి, డాన్ క్విక్ సెట్ నుదిటి మధ్యను రంగు రంగుల రిబ్బన్లు అట్టముక్కలు సీనారేకు బిళ్లలు అతికించి వున్నందువల్ల టోపీని వూడదీయటం వీళ్లకు కష్టమే అయింది. అదీకాక అసలు ఆటోపీ మాత్రం తలమీదినుంచీ తీసి వేయటానికి ఛస్తే ఒప్పుకోనని డాన్క్విక్ సెట్ పంతం పట్టాడు.

ఈలోగా హోటలు యజమాని (కాదు, కాదు గవర్నరుగారు) వుడికీ వుడకని వుప్పుచాపలు, గవులు కంపుకొట్టుతున్న రొట్టెముక్కలు పళ్లేలలో పట్టుకొచ్చి అతి వినయంగా డాన్ క్విక్ సెట్ ముందు పెట్టాడు. ఆ వంటకాలు ఎంత వాసన గొట్టుతున్నా, ఎంత తినరానివిగావున్నా, డాన్ క్విక్ సెట్ అంచనా ప్రకారం యీలాటి కోటలో తనకు పెట్టేది పంచభక్ష్య పరమాన్నాలే కాని అన్యం కాదాయెను. అందుకని ఆచేపలు అవీ తెముల్చుకు బయటకు వస్తున్నా, డాన్ క్విక్ సెట్ మాత్రం ఆప్యాయంగానే తిన్నాడు. తిండి యీతీరుగా వుంటే తినేందుకు వీల్లేకుండా రెండు చేతులతోనూ తలమీది టోపీ పట్టుకొని వుండవలసి వచ్చింది. ఈ పరిస్థితులలో ఆ అంగనలు యిద్దరూ దగ్గరచేరి రొట్టెముక్కలు, చేపముక్కలు అతని నోటికి అందించారు. ఒకచెంపను తింటూవున్న పదార్థం నోటికి హితవులేక వెళ్లుకు వస్తున్నా, యీ విధంగా వుత్తమ వంశ సంజాతలైన స్త్రీరత్నా లిద్దరు యిరు పార్శ్వాలచేరి సేవిస్తుండగా యీ 'పంచభక్ష్య పరమాన్నాలు' యిలా తినగలిగే భాగ్యం మరి ఎవరికీ వుండబోదు కదా అనుకొంటూ డాన్ క్విక్ సెట్ విందు ఆరగించు తున్నాడు. ఇంతలో బయట ఎవడో పందులు కాసుకొనేవాడు పందులను అదలించటానికి కొమ్ము వూదాడు. ఆధ్వనివిని అది తన గౌరవార్థం యీ కోటలో వినిపించిన వాద్య విశేషమేనని డాన్ క్విక్ సెట్ చంకలు ఎగురవేశాడు. (ఇంకావుంది)

# శాస్త్రిల్లవారి సమర్థింపు

(24-వ పేజీ తరువాయి)

తలంపుతో శాస్త్రిలుగారిని నిలుచున్న పాళంగా తీసుకొచ్చి తన ఎదుట హాజరు పరుచమని సేవకులకు ఆజ్ఞ వేశాడు. ఆ సేవకులు మంచి ఆవేశంతో వెళ్లి శాస్త్రిల వారిని పట్టుకొచ్చి జమీందారు గారు పడుకొన్న మంచం దగ్గిర నిలబెట్టారు. "ఏం జ్యోతిష్య మయ్యా, శాస్త్రిల్లూ, నీది? నువ్వు అన్ని లెక్కలూవేసి సుముహూర్తం అంటూ ఏదో పెట్టితివి. అది పాటించి నేను సరిగా ఆవేళకు బయలుదేరినందుకు నాకీ గతి పట్టింది. నీ జ్యోతిష్యం జోలికి పోకుండా దుర్ముహూర్తంలో బయలుదేరిన నా స్నేహితుడు సనాతనాచారి కేమో బోలెడంత డబ్బు దొరికింది. ఎందు కయ్యా నీ జ్యోతిషం; తగలెయ్యనా!" అని జమీందారు గారు కసిరాడు.

పాపం శాస్త్రిలుగారికి ముచ్చెమటలు పోశాయి. గొంతులో పచ్చి వెలక్కాయ పడ్డంత పని అయింది. ఈగండం ఎలా గడవటమా అని ఒక క్షణంసేపు ఆలోచించాడు. మంచి ఆలోచన తట్టింది!

"మహాప్రభూ! మీరు కోపం తెచ్చుకొని శాస్త్రాన్ని శంకిస్తున్నారు. కాస్త ఓపికపట్టి నే చెప్పేది సాంతం వినండి. అసలు మీకు మరణ యోగం వుండగా మంచి ముహూర్తంచూసి పెట్టించుకు బయలు దేరారు కనుకనే ప్రమాదం యింతటితోనే తప్పిపోయింది. ఇక మీ మిత్రుడు విషయమంటారా? ఆయన గనుక మంచి ముహూర్తం చూసి బయలు దేరి వున్నట్లయితే యిప్పుడు దొరికినదానికి యిబ్బడి ధనం దొరికివుండేది; అదేమిటి? ఇదేమిటి? ఒక జమీందారే అయి వుండేవాడు. దుర్ముహూర్తంలో బయలుదేరిన కారణంచేత అంతటి మహర్దశా బెత్తెడు వాసిలో తప్పిపోయింద"ని శాస్త్రిలు గారు సమాధానం యిచ్చారు.

జమీందారుకు యీ మాటల్లో సత్యమున్నట్లే తోచింది. తనకు చావుతప్పినందుకు, మిత్రునికిజమీందారీ రాకుండా పోయినందుకూ కూడా సంతోషించాడు. శాస్త్రిలు గారికి పారితోషికంముట్టచెప్పాడు*



# విజ్ఞానవీధులు

## "డాక్టర్"



## 11. వేడివల్ల వస్తువులు పెరిగితే మనకేం ?

మనకేం అనుకుంటే మనకేమీ లేదు. "వేడివల్ల వస్తువులు పెరుగుతాయా? ఈ పెరుగుదలవల్ల వచ్చే చిక్కులేమిటి?" అని ఆలోచిస్తే మాత్రం కనబడతాయి చిక్కులు.

వేసవి కాలంలో బండి చక్రాలకి అమర్చిన ఇనప పట్టాలు వేడికి పొడవు పెరిగి బండి పరిగెత్తుతూంటే ఊడి దొర్లిపోతాయి. జట్కాబండీ వాళ్లందుకే నీళ్లు పోస్తూంటారు చక్రాలమీద.

మనకి లోహాల వాడకము తక్కువ. వేడివల్ల పెరుగుదల లోహాల్లో ఏర్పాటుగా కనబడిపోతుంది. కర్రలో వేడివల్ల నీరు ఇగిరిపోడము వంటి ఇతర మార్పులు బలమై పెరుగుదలను ఏర్పాటుగా కనపడనియ్యవు. లోహాల్లో వేడివల్ల కలిగే మార్పులలో పెరుగుదలే పెద్దమార్పు. అందువల్ల ఈ పెరుగుదల లోహాల్లో సులువుగా గుర్తించవచ్చును.

రైలు పట్టాల నడిమిఖాళీ, బ్రిడ్జి స్తంభాలమీద ఆ నేటటువంటి ఇనపదూలాల అంచుల మధ్యన ఉన్న ఖాళీ అందరు ఎరిగినదే. ఓడలు నిర్మించేపట్ల అడుగడుక్కీ వస్తుంది ఈ లెక్క... టెలిగ్రాపు స్తంభాలమీది తీగలు బరువువల్ల ఈ స్తంభానికీ ఆ స్తంభానికీ మధ్య వంగుతాయి. శీత కాలంలో ఈ తీగలు ఆకుంచనము ఎంత వుంటుందో లెక్కగట్టి దానినిబట్టి స్తంభానికీ పంభానికీ మధ్యన ఎంత పొడవు తీగకట్టాలో నిర్ణయించుకోవాలి. శీతల దేశాల్లో ఈ అవసరము మరీ యెక్కువ.




పొడవు తక్కువైన లోహ పరికరాల్లో వ్యాకోచ, ఆకుంచనాల అల్లరి కొంచెంలాగ కనపడినా మరిచి పోయేటందుకు వీలులేదు. రెండువేపులా బిగించిన లోహపు కడ్డీ ఎక్కడున్నా అక్కడ ఈ చిక్కు వుండనే వుంటుంది.

బిగింపు కూడా అత్యవసరము కాదు. పెద్ద పెద్ద గోడ గడియారాల్లోని లోలకము వేసవిలో పొడుగవడము వల్ల ఆలస్యంగా నడుస్తుంది. శీతకాలంలో త్వర త్వరగా నడుస్తుంది. ఈ చిక్కుకి ప్రతిగా లోలకాన్ని రెండురకాల కడ్డీలతో చట్రంలాగ తయారుచేసి, తక్కువ వ్యాకోచమున్న కడ్డీలను పైభాగంలోనూ ఎక్కువ వ్యాకోచమున్న కడ్డీలను క్రిందనూ చట్రానికి బిగిస్తారు. వాటి పెరుగుదలవల్ల లోలకము ఎంత పొడవై అడుక్కి దిగుతుందో వీటి ఆకుంచనము వల్ల అంతే పైకి ఎక్కుతుంది. లోలకము మొత్తపు పొడవు స్థిరంగానే వుంటుంది.

(36-వ పేజీ చూడండి)

# మామయ్య తెచ్చిన మామిడి పళ్లు

జయంతి వెంకటేశ్వర్లు

ఒకరోజు బజారు వెంబడి పోతున్నాను. ఒక దుకాణంలో మామిడిపళ్లు రకానికో దొంతర చొప్పున అయిదారు రకాలు పేర్చబడి ఉన్నాయి. అవి చూసేసరికి నాకు చటుక్కున చిన్ననాటి ఘటన ఒకటి జ్ఞాపకానికొచ్చింది.

నా చిన్నప్పుడు మేము మద్రాసులో ఉండేవాళ్లం. నా కప్పుడు ఎనిమిదేళ్లుంటాయి. ఆదివారం మా నాన్నకి శెలవురోజు కాబట్టి, నేనూ, మా నాన్నా కలిసి వారానికి సరిపడే కూరలు తెచ్చేవాళ్లం.

ఒక ఆదివారం నాడు నేనూ, మా నాన్నా అమ్మ కాచిఇచ్చిన కాఫీ తాగి బయలుదేరాం; బజారుకి కూరలు కొనడానికి. కూరలన్నీ పరకాయించాడు మా నాన్న. బంగాళా దుంపలు నాకిష్టమని, వంకాయలు నాన్న కిష్టమని ముందు కొనేశాము. ఇంకా అలాగే కూరలన్నీ చూస్తూ పచారు చేస్తున్నాము. ఇంతట్లో మామామయ్య ఎదురైనాడు.

"ఏమోయ్, బావా, ఎప్పుడొచ్చావు. ఏమిటి విశేషాలు. అంతా ఖులాసాగా ఉన్నారా?" అని పలకరించాడు మా నాన్న.

"ఆఁ! అంతా ఖులాసాయే. నిన్న వర్తకులతో పనివుండి వచ్చాను. ఈ వేళ మెయిలుకి వెళ్లిపోతున్నాను." అన్నాడు.

"వెళ్లి పోవడమేమిటి? ఇంటికి పద; ఈవాళ్టికి ఉండి వెడుదువు గాని" అన్నాడు నాన్న.

"ఇంటికి వెళ్లే వస్తున్నాను. చెల్లెలు మీరు మార్కెట్టు కెళ్లేరంట, విన్నా, కుర్రాణ్ణి కూడా చూచి పోదామని యిలా వచ్చాను. పిల్లలకి ఒంట్లో బాగాలేదు కూడాను; తప్పని సరిగా వెళ్లిపోవాలి. మెయిలుకి వెళ్లిపోతున్నాను" అన్నాడు మామయ్య.

''సరే, యింక అలా అంటూంటే ఏమంటాను!'' అన్నాడు నాన్న.

''మామయ్యా, నాకేమి తీసుకొచ్చావు'' అనడిగాను నేను.

''ఆరురకాల మామిడి పళ్లు తీసికొచ్చానురా. ఇంట్లో అమ్మ చేతికిచ్చాను'' అన్నాడు మామయ్య. ఎగిరి గంతేశాను.

(35-వ పేజీ చూడండి)



# గడియారం చెప్పిన కథ



(గత సంచిక తరువాయి)

"నిప్పు అలారం" గడియారాన్ని గురించికదూ చెపుతా నన్నాను?" అంటూ గడియారం సుందరాన్ని హెచ్చరించింది. "ఐతే విను. ఈ మాదిరి గడియారం యిప్పటికీ చైనాలో వాడుకుంటారు. ఒక చిన్న కొయ్యబోటు వంటి దానిలో రంపపు పొట్టుతో తయారుచేసిన ఒక కర్ర ముక్కను పెట్టి వుంచుతారు. ఈ కర్రకు అడ్డంగా అటూ యిటూ రెండు యినుపగుండ్లు కట్టి వుంచిన ఒకదారం ముక్కను పెట్టుతారు. ఇనుప గుండ్లకు దిగువను కొంచెం క్రిందుగా రెండు కంచు పళ్లేలు అట్టేపెట్టి, రంపపు పొట్టుతో తయారుచేసిన ఆ కర్ర ముక్కకు ఒక చివరను నిప్పు అంటించి ఎవళ్ల పనిమీద వాళ్లు వుంటారు. ఆకర్ర అలా నెంపాదిగా కాలుతూ కాలుతూ చివరకు కర్రకు అడ్డంగాపెట్టి వుంచిన దారం ముక్కదాకా వస్తుంది. దారం ముక్క కూడా యిట్టే కాలిపోతుంది. ఎప్పుడైతే దారం ముక్క కాలిపోయిందో, ఆదారానికి రెండు చివరల కట్టివుంచిన యినుపగోలీలు అడుగునవున్న కంచు పళ్ళేలమీద పడి తంగున మోగుతాయి. ఆమోతే అలారం అన్నమాట."



"నాలాంటి వాడైతే యీ మాత్రపు అలారానికి ఛస్తే నిద్ర లేవడనుకో!" అని సుందరం అన్నాడు.

"అది సరేలే. అందరూ నీలాగే బండనిద్ర పోతారా మరి? అవును కానీ గంటను ఎన్ని రకాలుగా విభజించేవారో నీకు తెలుసా?"

"ఆ; ఏముందీ? అరగంట, పావుగంట, నిమిషం, సెకండు."

"అది యిప్పటిలెక్క. పూర్వం గంటను నాలుగు భాగాలుగాను, పదిహేను భాగాలుగాను, నలభై మొమెంట్లుగాను అరవై నిమిషాలుగాను, యిరవైరెండు వేల ఐదు వందల యూటంలుగాను విభజించేవారు. మరొక ప్రబుద్ధుడు యీ విభజనకు ఒప్పుకోక ఒకగంట, నాలుగు పావుగంటలు, నాలుగు మొమెంట్లు, నాలుగు వందల ఎనభై ఔన్సులు, ఐదువేల ఆరువందల నలభై నిముషాలు గాను విభజించాడు."

"ఏడిసి నట్లుంది: 60 నిమి

పాలు, 60 సెకండ్లు చొప్పున విభాగాలు వుంటేనే యీ లెక్కలు కట్టలేక తల్లక్రిందు లౌతున్నాం. ఇన్ని విభాగాలైతే ఒక్కొక్క గుణింతమూ కొన్ని రోజులు పట్టుతుంది.'' అన్నాడు సుందరం.

''ఇప్పుడా పీడ లేదుగా. గడియారాలలో పెండ్యులాలూ, బరువులూ తగిలించటం ఆ చరణలోకి వచ్చినప్పటినుంచీ యిప్పటి 60 నిముషాలు, 60 సెకండ్లు విభాగం వచ్చింది.''

''పెండ్యులం తగిలించిన గడియారం అంటే తెలుసుకానీ, బరువులు తగిలిన గడియారం అంటే?'' సుందరం అడిగాడు.

''బరువులు తగిలించి గడియారాలు నడిపే పద్ధతి సరిగ్గా ఎవరు కనిపెట్టారో చెప్పలేం. కానీ 700 ఏండ్లకు పూర్వం సలాదీన్ సుల్తాన్, రెండో ఫ్రెడరిక్ సార్వభౌముడికి యీ మాదిరి గడియారాన్ని ఒక దానిని బహూకరించాడు. దాని విలువ ఎంతో తెలుసా? 5 వేల నాణేలు. చాలా పెద్ద ఖరీదుకదూ''

''కాదూ మరి; అంతడబ్బు పెట్టితే ఒకవూరే కొనెయ్యవచ్చు.''

''అవునవును. ఇంతకీ బరువులు తగిలించే గడియారం అంటే మరేమీ లేదు. పెండ్యులం అంటేనే ఒక బరువైన వస్తువు కదా: కాబట్టి బరువులు తగిలించిన గడియారాలంటే పెండ్యులం వుండే గడియారాలే నన్నమాట. "బిగ్ టామ్"ను గురించిన కథలు నువ్వు ఎప్పుడైనా విన్నావా?"



''బిగ్ టామ్ అంటే ఎవరు? ఏ దేశపు కుర్రాడు?''

గడియారం పక్కున నవ్వింది. "బిగ్ టామ్ అంటే కుర్రాడు అనుకొంటున్నావా? ఎబ్బే. అదొక గడియారం. ఇది లండన్ లో నాలుగు వందల ఏండ్లపాటు ఒక్క క్షణం అయినా ఆగకుండా పని చేసింది. ఒకటవ ఎడ్వర్డు రాజు యీ గడియారాన్ని వెస్టుమినిస్టర్ భవనం బురుజుమీద కట్టించాడు. ఇంగ్లాండు దేశంలో కల్లా యిదే మొదటి గడియారం అయిన కారణంచేత ఆ దేశస్థులు దానిని

# మామయ్య తెచ్చిన మామిడి పళ్లు

(32-వ పేజీ తరువాయి)

"వెళ్లొస్తాను బావా" అంటూ నాన్న వైపుతిరిగి శెలవు తీసికొని "వెళ్లొస్తాను రా అబ్బాయీ" అంటూ నాబుగ్గమీద చిటికివేసి వెళ్లిపోయాడు స్టేషనుకి.

దారిలో వస్తూ నాన్నా! మామయ్య ఆరురకాల పళ్లు తీసుకొచ్చాడుట" అన్నాను నేను.

"నలుగురినీ పిలిచి డిన్నర్ చేతాంరా, మామిడి పళ్లతోటి" అన్నాడు నాన్న.

"తాండ్ర పోయించు నాన్నా!" అన్నాను నేను. నాకు తాండ్ర అంటే మహా యిష్టం.

"అన్ని పళ్లూ తాండ్ర యేం జేసుకొంటాము? కొన్ని పళ్లు తాండ్ర కూడా పోయిస్తానులే." అన్నారు నాన్న.

మానాన్న యింటికిపోకుండా నే సరాసరిపోయి స్నేహితుల్నీ తోటి ఉద్యోగస్తుల్నీ డిన్నరుకు పిలవడం మొదలెట్టాడు. కొందరికి పళ్లు పంపిస్తా నన్నాడు. నాకు తాండ్ర పోయిస్తా నన్నాడు.

"ఆరు రకాలూ కలిసి అధమం నూటయాభై అయినా ఉండకపోవు" అనుకుంటూ యింటికి జేరాము నేనూ నాన్నా.

"ఏమండీ! యింత ఆలస్యం చేశారు. పన్నెండు గంటలకా కూర తేవడం" అంటూ అమ్మ విసుక్కుంది.

"మీ అన్నయ్య మామిడి పళ్లు తెచ్చాడుట, ఏవీ" అనడిగాడు, అమ్మ మాట వినిపించుకోకుండానే.

"అదిగో, ఆ గదిలో బీరువాలో పెట్టాను. ఆరు రకాలుట - తీసుకొచ్చాడు" అంది అమ్మ.

ఆ బీరువాలో పెట్టివున్న పళ్లు చూసి, మా నాన్న నేనూ ఒకరి మొఖాలొకరు చూసుకొని ఆశ్చర్యపోయాము.

"పళ్లన్నీ యేవే?" అంటూ గద్దించాడు నాన్న.

"ఎన్ని పళ్లండీ, ఆరున్నాయి. ఆ బీరువాలో చూసు కోండీ. నే




యజమాని: నన్ను వెధవను చెయ్యదలుచుకొన్నావా, ఏం?
నౌకరు: అంతటి గౌరవం నాకు అక్కర లేదు లెండి.

ముద్దుగా పెద్దన్నయ్య అన్నట్లు 'బిగ్ టామ్' అని పేరు పెట్టుకొన్నారు. మంచుదుప్పటిలా లండన్ మహానగరాన్ని దట్టంగా కప్పివేసిన సమయాల్లో కూడా యీ బిగ్ టామ్ గంటకొకసారి గంటలు కొట్టి 'కాలం గడిచిపోతున్నది; తొందర పడండ'ని ప్రజలకు హెచ్చరికలు చేసేది. 'బిగ్ టామ్' స్థానే 'బిగ్ బెన్' వెలిసింది. 'బిగ్ బెన్' విషయం చెప్పేముందు మరికొన్ని గంట స్తంభాల కథలు చెపుతాను." అని వూపిరి పీల్చుకొన్నది గడియారం.

(ఇంకావుంది)

నింకా ఒక్కటీ ముట్టుకోనేలేదు'' అని అన్నది అమ్మ ఆశ్చర్యపోతూ.

మానాన్న బీరువా దగ్గర కెళ్లి చూసి "అవునే యిక్కడ రకాని కొక్కొక్కటి ఉన్నాయి. తక్కిన వన్నీ యేమయాయి. చెప్పు'' అన్నాడు నాన్న కోపంగా.

"మా అన్నయ్య తెచ్చిన వంతేనండీ. తక్కిన వేమిటి? మీకు పిచ్చెక్కి నట్టుంది; అన్నది అమ్మ తెల్లబోయి.

నాన్నకి నిజంగా పిచ్చెక్కిపోయి "ఎక్కడ దాచావో చెప్పు తక్కిన వేమయాయో చెప్పు,'' అంటూ చాపాటి కర్ర పుచ్చుకుని ఒళ్లూపై తెలియకుండా కొట్టేస్తున్నాడు అమ్మని.

నేను పరుగెత్తు కుంటూ పోయి ప్రసాదరావు గార్ని పిలుచుకు వచ్చాను. ఆయన నాన్నకెంతో ప్రాణస్నేహితుడు. వారి ధర్మమా అంటూ నాన్నని లాక్కెళ్లారు బయటికి.

అమ్మ ఒళ్లు తెలియకుండా పడుక్కుని ఉంది. ఇంతట్లో నాన్న మందు సీసాతో యింటికివచ్చాడు. నేనూ నాన్నా కలిసి అమ్మకు సపర్యలు చేస్తున్నాము. నాన్న "మీ మామయ్య ఎంతపని చేశాడురా!'' అని అన్నాడు.

"పూర్తిగా తెలుసుకోకుండా నువ్వు చేసినపనికి మామయ్య ఏం జేస్తాడు? ఇంతకీ నువ్వూ, మామయ్యా కలిసి అమ్మఒళ్లు హూనం చేశారు,'' అన్నాను నేను, తట్లు తేరిన అమ్మ శరీరానికి కాపడం పెడుతూ.



# పంచతంత్రం

## (బొమ్మలకథ)

కొన్ని వేల ఏండ్లకు పూర్వం నుంచి మన దేశంలో ప్రచారమౌతూ, యించు మించు అన్ని ప్రపంచ భాషలలోకి అనేకమార్లు తర్జుమా అయివున్న పంచతంత్రం కథను కార్టూన్ల రూపంలో ఆంధ్రపత్రిక — సచిత్రవారపత్రికలో 11-6-52 సంచిక మొదలుకొని సీరియల్ గా ప్రచురిస్తున్నాం. జంతువులే పాత్రలుగా కలిగి, నవ్వు పుట్టించే చిన్న చిన్న కథలద్వారా నీతులు నేర్పే యీ కథ బొమ్మల రూపంలో వెలువడుతున్నందుకు మా పాఠక లోకం హర్షించగలదని ఆశిస్తున్నాం.

# విజ్ఞాన వీధులు

(31-వ పేజీ తరువాయి)

యంత్ర సామగ్రి తయారు చేసేటప్పుడు వేడివల్ల జరిగే వ్యాకోచాన్ని ఉపయోగించు కోడము చూస్తే శీర్షకలోని ప్రశ్న పుట్టనే పుట్టదు.

ఫిరంగులు చెయ్యడంలో గుండూ, మందూ కూరే చోట ఫిరంగిలోహానికి బలం ఎక్కువగా వుండాలి. మందు భగ్గుమన్నా తోపుడుకి గుండు పారాలి గాని ఫిరంగిలోహం పేలి పోకూడదు. అందుకని మందుగది గోడలకి అదనపు బలం చేకూర్చడానికి దగ్గిరగా కరుచుకుని వుండే తొడుగులు (బొమ్మలో 1,2సూచించేవి)అమర్చాలి. ఫిరంగి గొట్టము పైకైవారమూ, ఫిరంగితొడుగు లోపలి కైవారమూ సమంగా వుండేటట్లు తరిమిణిపట్టి తయారుచేసి, పైతొడుగు (బండి పట్టానిలాగే) వెచ్చబెట్టి అది పెరిగిన స్థితిలోనే దానిలో ఫిరంగి కొనదూర్చి, తొడుగుని చల్లార్చేస్తారు. పెద్ద ఫిరంగులకి ఈరీతిగా రెండు మూడు తొడుగులు కూడా చక్కగా అమర్చ వచ్చును.

చిన్న చిన్న చేతి వాచీల యంత్ర భాగాలు బిగించడములో అతి జాగ్రత్త చాలా అవసరము. బిగించే స్క్రూగాని, అది అమిరే కన్నము గాని ఎంత మాత్రమూ పెద్దా చిన్నా కాకూడదు. వీటిని రెండింటినీ సమంగా తయారు చేసినా స్క్రూయొక్క నరుకులు తెగి పోకుండానూ వంగి పోకుండానూ బిగించడము చాలా సున్నితమైన పని. అందుకని యంత్రాగారాల్లో ఈ చిన్న స్క్రూలను ఘనీభవించిన బొగ్గు పులుసు గాలిలో ముంచి చల్లారుస్తారు. ఈ చిన్న స్క్రూలు ఆకుంచనము వల్ల కొంత చిన్నవై, బిగించడానికి చాలా అనువౌతాయి. బిగించేసిన తర్వాత కొంత వ్యాకోచించినా సరిగ్గా అమిరే అంతవరకే పెరగ గలవు కనక కొత్త చిక్కులేవీ రావు.



# రెండు మహానగరాలు

(22-వ పేజీ తరువాయి)

వుంది. ఆ విజ్ఞానంతో అంత వంకాయిగాని, బీరకాయిగాని, కోడి పిల్లగాని చేతికి దొరికితే దాంతో ఒక విచిత్రమైన వంటకాన్ని తయారుచేసి పారేసేది. వంటయింటో పనిచేసే తక్కిన దాసీలూ వాళ్లూ, మిస్ ప్రాస్కు బహుశా ఏదో ఇంద్రజాలవిద్య తెలుసు నని భ్రమపడేవాళ్ళు.

ఒక్క ఆదివారంనాడు మాత్రం మిస్ ప్రాస్ డాక్టర్ గారి సహపంక్తిని భోజనంచేసేది. మిగతారోజుల్లోమాత్రం అలా అంగీకరించేదిగాదు. తనగదిలో తాను ఒంటరిగా కూర్చుని భోజనం చేసేది. ఆ గదిలోకి వెళ్ళటానికి, ఒక్క చిట్టితల్లికి మినహా మరొకళ్ళెవళ్లకి హక్కు లేదు.

ఆవేళ బాగా ఉక్కగావుంది. భోజనం ముగిసిన తరవాత, ద్రాక్షాసవం పెరటిదొడ్లో చెట్టుక్రిందకూర్చుని సేవించితే హాయిగా వుంటుందని, కాస్త గాలివేస్తుందనీ లూసీ సూచించింది.

ఆయింట్లో ఏ వ్యవహారం జరిగినా, లూసీకోసం, లూసీ అభిలాష ననుసరించీ జరుగుతుంది. అంతా చెట్టుక్రిందికి వెళ్ళి కూర్చోవటానికి అంగీకరించారు. లూసీ, లారీగారి సారాగిన్ని తానే స్వయంగా నింపి అందించుతోంది. చల్లాచల్లగా గాలివేస్తోంది. పైనున్న చెట్టు ఆకులు గుసగుసగా కదులుతున్నయ్.

ఇప్పటికీ యింకా వందలూ వేలూ యెవరూ రాలేదు. డార్నే మాత్రమే వచ్చాడు—ఒక్కడే.

డాక్టర్ మానెట్ అతన్ని యెంతో ఆప్యాయంగా ఆహ్వానించాడు. లూసీకూడా ఎంతో ఆదరణ చూపింది. ప్రాస్ కు మాత్రం ఒళ్ళు మండిపోయింది. చీమలూ జెర్రులూ పాకుతున్నట్టు చిరాగ్గా లోపలికి వెళ్ళిపోయింది.

డాక్టర్ మానెట్ ఆ సమయంలో యెంతో ఆనందంగా వున్నాడు. ఆ సర్దాలో ఎంతో పడుచువాడుగాకూడా కనుపించుతున్నాడు. తండ్రీ కూతురూ ఒకరిప్రక్క ఒకరు కూర్చున్నారు. ఇద్దరి ముఖాలూ ఒకే పోలికలో వున్నయ్. కూతురు, అచ్చు తండ్రి పోట్లోనుంచి ఊడిపడ్డట్టుగా వుంది.

డాక్టర్ అనేక విషయాలమీద తసబోసిన పిట్టలా ఊపిరి సలపకుండా మాట్లాడేస్తున్నాడు. లండన్‌లోని ప్రాచీన భవంతుల మీద ఉపన్యాసం సాగుతోంది. 'ఇదుగో చూడండీ!' అంటూ డార్నె అడ్డుతగిలాడు, 'మీరు టవర్ చూశారుగా?'—

'చూడకేం నేనూ లూసీ యిద్దరం వెళ్ళి చూసొచ్చాం'

'నేనూ చూచాను లెండి—నేను అక్కడ కొంతకాలం వున్నాగా—' అతనిముఖం కొంచెం కోపంగా యెఱ్ఱబడ్డది; 'అక్కడుండగా ఒక సంగతి విన్నాను'—

'ఏమిటాసంగతీ'—లూసీ ప్రశ్నించింది.

'ఆ భవనంలో కొన్ని మరమ్మతులూ మార్పులూ చేయవలసి వచ్చి పనివాళ్ళు దాన్లోవున్న ఒక పాడుబెట్టిన చీకటికొట్లోకి వెళ్లారు. ఆ కొట్లో గోడలన్నీ అనేకరకాల వ్రాతలతో నిండి వున్నయ్—ఆకొట్లో పూర్వం వున్న ఖైదీలు వాటి నన్నింటినీ చిత్రించారు. అనేకరకాల శాసనాలు—తారీఖులు, పేర్లూ, కోరికలు, ప్రార్థనలు ఇత్యాదయః. అలాగే కొంతకాలం ఆ కొట్లోవుండి, అనంతరం ఉరితీయబడిన ఒక ఖైదీ, తన్ను ఉరికంబానికి తీసుకుపోబోయేముందు. గోడమూలగా వున్న ఒక రాతిమీద, మూడు అక్షరాలు చెక్కాడు యేదో చేతి కందిన పనిముట్టుతో. అక్షరాల పోలికలు సరీగా గుర్తుబట్టటానికి తగినంత స్పష్టంగా లేవు. మొదట కొంతమంది వాటిని, "డి. ఐ. సి." అని చదివారు. కాని తీరా బాగా పరిశీలనగా చూస్తే, చివరి అక్షరం "జి" గాని, 'సి' కాదనుకున్నారు. అంతేగాక అవి మూడూ మూడు పొడిఅక్షరాలు కావనీ 'డిగ్' (త్రవ్వు) అనే మాటైవుంటుందనీ అనుకున్నారు. తీరా ఆ మూల పెల్లగించి చూస్తే, తగలబడిపోయిన ఒక తోలుసంచీ బూడిద, కాలిపోయిన కాయితంముక్క మసీ కనుపించాయి. ఆ అజ్ఞాతఖైదీ యేమి రాశాడో యెవ్వరికీ తెలీదు. మొత్తానికి యేదో వ్రాసి, జైలరుకు కనుపించకుండా అలా పాతేసివుంటాడు.'

'నాన్నా!' అంటూ కంగారుగా లేచి లూసీ తండ్రి చెయ్యి పట్టుకుంది: ఆయన ముఖం అయోమయంగావుంది. నుదురుమీద చెయ్యివేసుకుని ఆయనకూడా లేచి నిల్చున్నాడు. ఆయన స్థితిగతులు గమనించి చుట్టూ వున్నవాళ్ళంతా కాళ్లు త్రొక్కుకుంటున్నారు.

'మరేం లేదమ్మా—వాన-చినుకులు పడుతున్నయ్ అందుకని లేచాను—లోపలికి వెడదాం.'

నిజంగా చినుకులు పడుతున్నమాట కూడా నిజమే; చేతిమీదపడ్డ చినుకులు కూడా చూపించాడు. కాని, డార్నె చెబుతున్న సంగతిని గురించి ఆయన ఒక్క ముక్కయినా మాట్లాడలేదు. అంతా కలిసి ఆయన్ను లోపలికి తీసుకువెళ్లారు; లోపలికి వెళ్ళిన కొద్దిసేపటికే, ఆయనకి తిరిగి కులాసాచిక్కి ప్రజల్లో పడ్డాడు.

ఇంతలోకే టీకి వేళయింది—మిస్ ప్రాస్ టీ తయారు చేస్తోంది—వందలూ వేలూ రాకపోయినా—మళ్లా చిరాకుముఖం పెట్టింది. ఇప్పుడు అదనంగా వచ్చిందల్లా కార్టన్ ఒక్కడే.

ఆరాత్రి బాగా ఉక్కపోస్తోంది. కిటికీలూ తలుపులూ తెరిచేవున్నా ఇంకా ఉక్కగానే వుంది. టీ త్రాగిన తరవాత తలో కిటికీ దగ్గరికీ వెళ్ళి బయటికిచూస్తూ నిల్చున్నారు. లూసీ మాత్రం తండ్రిదగ్గిరే కూర్చుంది. డార్నె ఆవిడప్రక్కనే కూర్చున్నాడు. కార్టన్ కిటికీకి చారబడి నిల్చున్నాడు. కిటికీలకు వ్రేలాడుతున్న తెరలు గాలికి ఉవ్వెత్తుగాలేచి చుట్టలు జుట్టుకుంటున్నయ్.

'వానచినుకులు ఇంకా పడుతూనే వున్నయ్' అన్నాడు డాక్టర్. 'వర్షం బాగా జోరయ్యేటట్టేవుంది.'

'అవును జోరయ్యేటట్టేవుంది' అన్నాడు కార్టన్.

వీధిలో జనం దబదబా నడుస్తున్న పదధ్వనులు వినిపించుతున్నయ్. గాలీవానా రాకముందే త్వరగా ఇళ్ళకు జేరుకోవాలనే ఆదుర్దాతో జనం త్వరత్వరగా వెళ్ళిపోతున్నారు. ఆ పదధ్వనులు మేడంతా ప్రతిధ్వనించుతున్నయ్.'

'చుట్టూ వందలాది ప్రజల సంచలనం—అయినా యిది యేకాంత ప్రదేశంగానే వుంది' అన్నాడు డార్నె.

'డార్నె! నేను సాయంత్రంపూట ఇలానే కూర్చుని ఈ ప్రతిధ్వనులు వింటూవుంటాను నా కెందుకో భయమేస్తుంది'—

'ఆ జనసమ్మర్దం మన జీవితాల్లోకి కూడా చొచ్చుకువచ్చే రోజురావచ్చు' అన్నాడు కార్టన్, యేదో ప్రపంచంలోనుంచి మాట్లాడుతున్నట్టు.

పద ధ్వనుల ప్రతిరావాలు యింకా జోరవుతున్నయ్. మరింత త్వరితగతిని నడిచిపోతున్నారు.

'ఇంతమంది ప్రజలూ మన అందరి జీవితాల్లోకీ ప్రవేశించుతారా లేక కొంతమంది కొందరి జీవితాల్లోకీ మరి కొంతమంది మిగతావాళ్ళ జీవితంలోకీ ప్రవేశించుతారా అనేదే అనుమానం' అన్నాడు డార్నె.

'దూరాన ప్రజాసమూహం కనుపించుతోంది' అన్నాడు కార్టన్: 'మెరుపుమెరిసి చీకట్లను చీల్చినప్పుడల్లా వాళ్ళు నాకు కనుపించుతున్నారు. త్వరత్వరగా మనవేపు నడిచివస్తున్నారు'—

ఈ మాటలు ముగించాడో లేదో ఫెళఫెళా ఉరుములూ మెరుపులూ ప్రారంభమైనయ్.

పెద్దపెట్టున తుపాను రేగింది. ఆ హోరులో ఒకరిమాట ఒకరికి వినిపించకుండా పోయింది. 

# నీటుగలసిన త్యాగాలు

(15 వ పేజీ తరువాయి)

ఇన్నాళ్లూ నాగరాజు కోసం తాను చేసిన ఈ త్యాగానికి రోజుతో సంపూర్తి......

ఆలోచిస్తూ బట్టలు వేసుకుని రోడ్డు పట్టాడు. నాగరాజు పూర్వాశ్రమంలో పని చేస్తోన్న హోటల్ కనిపించింది. అందులోకి వెళ్లి కాఫీ తాగాలనే వాంఛ అతనికి కలిగింది. ఆ అనుభవం ఎలాగ ఉంటుందో?

ఆలోచిస్తూనే లోనికి నడిచాడు.

సర్వర్ వచ్చి—"ఏం కావాలి సార్?" అన్నాడు.

"స్ట్రాంగ్ కాఫీ"

సర్వర్ వెళ్ళాడు. మ్యానేజర్ వెంకటరావుని గుర్తించాడు. తొందరగా వచ్చి పక్కన కూర్చుని "నమస్కారం సార్" అన్నాడు.

వెంకట్రావు అతని జ్ఞాపకశక్తికి కొంచెం ఆశ్చర్యపడి, "వ్యాపారం బాగా సాగుతోందా?" అన్నాడు.

"దేవుడి దయ సార్.. మీరు నాడు ఏమి మంచిపని చేస్తిరి సార్! మొన్న రోజు నాగరాజు భాగవతర్ పాట రేడియోలో వింటిని—ఎంత పాండిత్యం సార్!"

"అవును."

కాఫీ వచ్చింది. వెంకట్రావు దాన్ని తీసుకోబోతోంటే అయ్యరు వారించి సర్వర్ని కేక వేసి, "స్పెషల్ కాఫీ తీయరా" అన్నాడు. మళ్లా వెంకటరావు వైపు తిరిగి "ఈ కీర్తి అంతా మీదా సార్. సంగీతశాస్త్రానికి ఉపకారం చేస్తిరి. చాలా సంతోషం చేస్తిని. అతను నా హోటల్ సర్వర్ అని చెప్పేదానికి విచారం చెయ్యాలో, సంతసం అవాలో తెలియదు సార్."

వెంకట్రావు కాఫీ ముగించేలోపున అయ్యరు అతన్ని చాలా పొగిడాడు. వెంకట్రావు బరువెక్కిన గుండెలతో హోటల్ వదిలి, ప్రభ ఇంటివేపు నడిచాడు.

ఇంకా ఎండ పూర్తిగా తగ్గకపోయినా ప్రభ పెంచుకున్న తోటలో చల్లగానే ఉంది. వెంకటరావు తలుపు తోసి లోనికి వెళ్లేసరికి, ఈజీ చెయిర్ లో కూర్చుని ప్రభ ఏదో చదువుకుంటూంది. వెంకట్రావుని చూడగానే ఆనందంతో ఒక్క కేక వేసి పుస్తకం నేలమీద పడవేసి, అతనికి స్వాగతం ఇచ్చింది.

అతి కష్టంమీద వెంకటరావు మాటలాడగలిగాడు. ఏదో మహా నేరం చేసినట్లు అతను *Feel* అవుతున్నాడు.

"ఆరోగ్యం చాలా పాడయింది ప్రభా"

"ఏం చేసేది?...పోనీ నీకిప్పటికైనా దయవచ్చిందా?"

"రోజులు బాగులేక పోతే అన్నీ అలాగ వస్తాయి ప్రభా...మీనాన్నకి నామీద కోపం తగ్గితే..."

"ఆయనకి నీమీద కోపం ఎందుకు బావా? వాడిని నువ్వు వదిలేస్తే అదే చాలు.. వాడినీ చాలా పెద్దవాడిగానే చేశావుగా?"

వెంకటరావు గుండె ఝల్లుమన్నది. అతను మాట్లాడలేదు.

"లోపలికి వెళ్దామా బావా?" ప్రభ ఆతృతగా అన్నది.

ఆమె నీరసంగా లేచింది. చేతిమీద ఆనించుకుని వెంకటరావు ఆమెని లోనికి తీసికొని వెళ్లేడు.

"ఎప్పుడు వచ్చావు బావా?" అన్నాడు.

శ్రీపతి...అతని ముఖంలో సిగ్గు తాండవిస్తూన్నది. జవాబివ్వడానికి వెంకటరావుకీ సిగ్గుగానే ఉంది.

"ఇప్పుడే"

"వాడిని చాలా గొప్పవాడిని చేశావే?"

"నేను చేసినదేముంది? వాడే అయాడు"

శ్రీపతి ఇంకేమీ వ్యాఖ్యానించలేదు.

కాని అన్నిటికన్నా పెద్ద *Shock* వెంకట్రావుకి ఆరాత్రికి మిగిలింది. రాత్రి భోజనాలయ్యాక మాటలాడుతూ.."నాగరాజుని వాళ్ల మామావాళ్లూ చూచివచ్చారు తెలుసా?" అన్నది.

అతను తెల్లబోయాడు.

"వాళ్లకి చాలా డబ్బు అదీ ఇచ్చాడట కూడా. ఏమైనా వాళ్ళూ వాళ్ళూ ఒకటేగా?"

"పోనీ - వాడిమాట ఇంక చెప్పకు ప్రభా."

* * *

వర్షం పడుతున్నది. కిటికీదగ్గర నిల్చుని ప్రభ తీవ్రంగా ఆలోచిస్తూంది.

ఆమె వివాహం అయి నెలమాత్రం అయింది. వెంకటరావు ఇంటికి వచ్చింది.

ఆలోచిస్తూ ఆమె చేతిలో ఉన్న ఉత్తరం తీసి చదివిందింకొకసారి.

"శ్రీ అన్నగారికి:

నా కృతఘ్నతకి మీరు చాలా కోపగించుకుని ఉంటారు. మీకు కొద్దికాలం కలిగించిన మనోవ్యధకి క్షంతవ్యుణ్ని.

మీరు వివాహం చేసుకున్న విషయం విని చాలా సంతోషించాను. ఇప్పుడు నా రహస్యం మీకు చెప్పేస్తాను.

మీరు నాకు చేసిన ఉపకృతి నా జన్మలో మరువలేనిది. అలాటి మీకు కోపం తెప్పించడానికే ఇలాగ ప్రవర్తించాను. ప్రభావతిగారిని మీరు నాకోసం త్యాగం చేస్తున్నారని నాకు తెలిసి ఆ నష్టం మీరనుభవించకుండా చేయడానికే ఈపని చేశాను. ఇంక నా కాలం మీ సేవగా ఆదేశిస్తే అలాగే వినియోగిస్తాను.

దయ ఉంచి జవాబు వ్రాయమని ప్రార్థన.

నాగరాజు."

పెద్దగాలితో తుఫాను రేగుతూంది.

ప్రభ అగ్గిపెట్టె తీసి ఉత్తరం అంటించింది. మరుక్షణం ఆ నుసి ప్రవహిస్తోన్న నీటిలో కలిసిపోయింది. ఒక్కసారి ఆమె కళ్లుమాత్రం ఆర్ద్రాలయాయి. ★



యువావారి "టింగ్ రంగా" లో కొత్తతార ఆశాలత

# చంద్రహారం సెట్టుమీద షూటింగ్

రమీద కనిపించే చలనచిత్రం అదే క్రమంలో తయారుకాదనీ, వేరు వేరు సమయాల్లో తీయబడిన వేరు వేరు షాట్లు ఎడిట్ చేసి చిత్రంగా తయారు చేస్తారనీ అందరూ ఎరిగినదే. కథలో వివిధ సంఘటనలు జరుగుతాయి. ఈ సంఘటనలన్నీ ఒకే ప్రదేశంలో జరగవు. వివిధప్రదేశాలలో వివిధ సంఘటనలు జరుగుతాయి. ఆ సంఘటనలను కథాక్రమాన్ననుసరించి వరసగా షూట్ చేస్తూపోవటం సాధ్యం కాదు. ఒక సెట్ మీద జరిగే సంఘటనలన్నిటినీ ఒకే కాలపరిమితిలో షూట్ చేస్తారు. ఆ సెట్‌తో ఇక పని ఉండదు అని తేల్చుకున్న తరవాత దాన్ని నిర్మూలం చేసి మరొక సెట్ నిర్మిస్తారు. ఆ సెట్ మీద జరిగే సంఘటనలన్నిటినీ షూట్ చేసి, ఆ సెట్ తీసివేసి మరొక సెట్ నిర్మిస్తారు. ఆ సంఘటనలు కథ ప్రారంభంలో గాని, మధ్యలో గాని, అంతంలో గాని ఎప్పుడు జరిగినా జరుగవచ్చు. షూట్ చెయ్యటం మాత్రం ఒకేసారి చేస్తారు. అలాగే పాటలు కూడా. పాటలను సెట్ మీద ఎప్పుడూ రికార్డు చెయ్యరు. పాటలన్నిటినీ ఒకేసారి వేరేచోట రికార్డుచేసి తరవాత ఫిలిముతో 'సింక్రనైజ్' చేస్తారు.

విజయావారి రెండవ జానపదచిత్రం "చంద్రహారం" షూటింగ్ ఇప్పుడు రాజభవనం సెట్టుమీద జరుగుతున్నది. ముందు లాంగ్ షాట్‌లో పురస్త్రీలు ఒకొక్కరే రాణిగారి అంతఃపురంలోకి రావటం కనిపిస్తుంది. మీడియం షాట్‌లో అంతఃపుర మధ్యంలో చక్కని నగిషీపనితనంగల ఉయ్యాల కనిపిస్తుంది. క్లోజప్‌లో ఉయ్యాలను అల్లప్పు రాణి (పంకమాంబ) ఈ వైపు ఆమె సుమాన్తై ఆకాశదేవి (సూర్యకాంత) కనిపిస్తారు. కెమేరా ఇంకా దగ్గిరికి జరుగుతుంది. ఉయ్యాలలో ముద్దులొలికే చిన్నారిపాపను క్లోజప్‌లో కనిపిస్తాడు. మళ్లీ మీడియం షాట్‌లో పురస్త్రీలు ఒకరి వెనక ఒకరు వచ్చి ఓపనను ఆశీర్వదించి, వాయనాలు పుచ్చుకొని వెళ్లిపోతారు. రాణి లేక లేక కలిగిన పుత్రుణ్ణి చూసి మహదానందంతో పొంగిపోతూ ఉంటుంది.

మందిరం బయట ఇంటల్లుడు ధూమకేతువు (రేలంగి)తోను, ఇతర రాజులతోను నుంచుని ఉన్న రాజాగారు (శ్రీవత్స) కూడా తొంగిపోతూ ఉంటాడు బిడ్డను ముత్తైదువలు దీవిస్తున్న సమయంలో "లాలీ జయలాలీ — లాలీ శుభలాలీ — చిరునవ్వులే జయహారముగా — జగమంతటికీ పండుగగా — అని నేపథ్య గీతం వినిపిస్తూ ఉంటుంది.

ఈ దృశ్యమంతా తెరమీద నాలుగైదు నిమిషాల్లో జరిగిపోతుంది. కాని షూట్ చెయ్యటానికొక రోజంతా ఖర్చవుతుంది. లైటింగ్ పరికరాలు, కెమేరా అమర్చటానికి, కెమేరా కోణమార్గానికి సరిపడేటట్లు నటీనటుల చేత, ముఖ్యంగా కొత్తవారిచేత నటింపచెయ్యటానికి ఇంత కాలము అవసరమవుతుంది. అందులో టెక్నికల్ గా వేలెత్తి చూపటానికి వీల్లేనట్లు, సర్వవిధాలా నిర్దుష్టంగా, ఉత్తమంగా తయారుచెయ్యాలని విజయావారి సంకల్పం. ఈ సంకల్పానికి తగినట్లే కెమేరామాన్ బార్ట్లే లైటింగ్ ఏర్పాట్లను, లైటింగ్ లోని ప్రతి చిన్న ఛాయను, డిటెయిల్ ను ఒకటికి పదిమాట్లు పరిశీలిస్తేగాని సంతృప్తిపడడు. "పాతాళ భైరవి" టెక్నికల్ గా క్లాసిక్ అయిందంటే ఆశ్చర్యం లేదు.

అంతకుముందు షూటింగ్ రోజున అదే సెట్టుమీద వృద్ధాప్యంలోని రాజాగారు, పెరిగి పెద్దవాడైన ఆయన ఏకైకపుత్రుడు చందనరాజు (ఎన్ టి రామారావు) నమ్మిన వృద్ధసేవకుడు మాలి (రంగారావు) ఉంటారు చందనరాజు అప్పుడే దేశాలన్నీ తిరిగి వస్తాడు. అతనికి ఏ దేశపు రాజకుమార్తె నచ్చదు. "నేనేం చెయ్యను. నాకే రాజకుమార్తె నచ్చలేదు," అని తండ్రితో అంటాడు. రాజాగారు "ఎట్లా జరగాల్సి ఉందో అట్లా జరుగుతుంది. అన్నిటికీ చంద్రభగవానుడే ఉన్నాడు," అని నిరాశతో అంటాడు. ఫలానా వయస్సులోగా పెళ్లికాకపోతే చందనరాజు చనిపోతాడని రాజాగారికి మాత్రమే తెలుసు. అదీ ఆయన విచార కారణం ..

చంద్రదేవుని వరప్రసాదఫలితంగా పుడతాడు చందనరాజు పుట్టటప్పుడే మెళ్ళో చంద్రహారంతో పుడతాడు. ఈ చంద్రహారానికి కథలో పెద్ద ప్రాముఖ్యం ఉంది. అందుకే చిత్రానికి ఆ పేరు పెట్టారు

రేలంగి నటించే పాత్ర ధూమకేతువు రాజాగారి ఇల్లరికపుటల్లుడు; అంటే ఆశాదేవి భర్త. రాజాగారికి కొడుకులు లేకపోతే తనకే రాజ్యం దక్కుతుందనే ఆశతో ఉంటాడు. చందనరాజు పుట్టటంతో అతని ఆశలు తలకిందులవుతాయి "పాతాళ భైరవి"లో రేలంగి ఉపయోగించిన ఊతపదం "తప్పు తప్పు" ఇంకా ప్రజల వాడుకలోంచి పోకమునుపే ఈ చిత్రంలో మరొక కొత్త ఊతపదం ప్రయోగిస్తున్నాడు.

కారెక్టర్ ఆక్టర్ ఎస్.వి రంగారావును "ఏమండీ అంఫట్ గారూ!" అని పలకరిస్తే వియ్యన్నలాగా ఒక ముక్కుముక్కి "ఇన్సల్ట్!" అంటాడు. ఎందుకంటే అతడు నటించే మాలిపాత్ర విలన్ పాత్ర కాదు. నమ్మినబంటు పాత్ర

విజయావారి చిత్రాల్లో కనిపించే ఒక ప్రత్యేకత ఏమిటంటే ప్రతిచిత్రంలోనూ "టిపికల్" పాత్రలను ప్రవేశపెడతారు. 'షావుకారు'లో చాకలిపాత్ర, రంగడు, షావుకారు; 'పాతాళ భైరవి'లో రేలంగి, రామారావు నటించినపాత్రలు, 'పెళ్లి చేసిచూడు'లో వియ్యన్న వీరంతా 'టిపికల్" పాత్రలే. వీరు తెరమీద కనిపిస్తూనే సునాయాసంగా ప్రేక్షకులకు పరిచయమౌతారు, కన్యాశుల్కంలో గిరీశంలాగ ★



"సింగారి" లో లలిత

## తారలపదతి

"మనదేశంలో నిర్మాతలు ఇతర దేశాల చిత్రనిర్మాణంలోని మంచిని అనుకరించలేమి? చెడ్డనే అనుకరిస్తారేమి?" అని ఒక



అవర్ ఇండియావారి "నాయిల్లు" లో నాగయ్య, పిల్లలు.

రడిగిన ప్రశ్నకు "అనుకరించటం మంచిదే అనుకరిస్తారు, కాని చెడ్డగా అనుకరించి బోల్తా కొడతారు" అని ఒక సినిమాపత్రిక జవాబిచ్చింది ఇది సరియైన జవాబేనని తోస్తుంది. దీనికి మంచి ఉదాహరణ ఉన్నది: చార్లీచాప్లిన్ సుప్రసిద్ధ అమెరికన్ హాస్యనటుడు అతనిని అనుకరించటానికి ఒక హిందీనటుడు ప్రయత్నించి 'చార్లీ' అనే పేరుకూడా పెట్టుకున్నాడు. పేరువరకే ఈ అనుకరణ సాగిందిగాని నటన వరకూ రాలేదు. వెర్రిచేష్టలుగా కనిపించే చార్లీచాప్లిన్ నటనలో లోతైన అంతరార్థం ఉంటుంది ఈ అంతరార్థం లేకుండా చాప్లిన్ ఏ వెర్రిచేష్టా చెయ్యడు. గడచిన ట్రీర్ సంవత్సరాల్లో చాప్లిన్ అనేకచిత్రాలు తీశాడు వాటిమూలంగా అతడు మరెవరికీ లేని ఒక వ్యక్తిత్వం సంపాదించుకున్నాడు అతన్ని చూడగానే ముందు నవ్వు కలగవచ్చు కాని తరవాత కలిగేది కరుణ భావం. ఆ చిన్నమనిషి, వదులు పంట్లాము, పాదాలకి రెండింతలుండే తుక్కు బూట్లు, నిస్సహాయత సూచించే కళ్లు, నడక— ఇదంతా చూస్తే విశాలమైన అమెరికన్ భూభాగంలో ఈ చివరినుంచి ఆ చివరికి కాళ్ళీడ్చుకుంటూ, ఏవో మెరిసే శిఖరాల కోసం పయనించే వ్యక్తి, ధనస్వామ్యపు నిరంకుశత్వంకింద నలిగి మొండిబారినవ్యక్తి గోచరిస్తాడు ఆ వ్యక్తిని అనుకరించటం అసాధ్యం అనుకరించబోతే ఆనటన కేవలం అర్థంలేని వెర్రిచేష్టలకింద తయారవుతుంది. హిందీనటుడు చార్లీ అలాగే హాస్యాస్పదుడయ్యాడు

తారల పద్ధతి (స్టార్ సిస్టమ్)ని అనుకరించటంకూడా అలాగే తయారైంది. హాలీవుడ్‌లో తారలను చిత్రానికి ఎన్నుకోవటంలో రెండుపద్ధతు లున్నాయి ఒకటి తారలనుబట్టి, మరొకటి కథనుబట్టి. కథను ముందు నిర్ణయించుకుని కథలో వచ్చే పాత్రల వ్యక్తిత్వానికి ఏ నటీనటులను ఎన్నుకుంటే బావుంటుందో వారిని ఎన్నుకుంటారు. అంటే ముందు నిర్ణయమయ్యేది కథ; తరవాతనే నటీనటులు. ఇంకొక పద్ధతి ప్రకారం ముందు తారలను నిర్ణయించుకొని తరవాత వారికి సరిపడే పాత్రలు కల కథను రాసుకుంటారు చార్లిచాప్లిన్ చిత్రాలన్నీ ఇలాటివే రెడ్‌స్కెల్టన్, లారెల్, హార్డీ చిత్రాలు, కొన్ని రోనాల్డ్

కోల్మన్ చిత్రాలుకూడా ఇందుకు ఉదాహరణాలు.

మనదేశంలో తారలపద్ధతి వికృతరూపం దాల్చింది. సాధారణంగా మన నిర్మాతలు ముందు కథావస్తువును, కథను నిర్ణయించుకుంటారు కథ ననుసరించి ముఖ్య నటీనటులను ఎంచుకోనేబదులు, అదివరకే తమ దృష్టిపడిన తారలను-వారి అందాన్ని చూసో, ప్రజలకు వారిపై మోజు ఉందని భ్రమించియో-కథలోకి ఇరికిస్తారు ఇందువల్ల తెరమీద అందమైన ముఖాలు కనిపిస్తాయన్నమాట నిజమే కాని కథగాని, పాత్రగాని ఏవిధంగానూ పోషించబడదు కథను బట్టి నటీనటులను ఎంచుకొనే పద్ధతే సరియైనది. ఎలాగో ఒకలాగ ఫలానా తారను తెరమీది కెక్కించాలనుకుంటే చిత్రం రసాభాసం అవుతుంది ★

# మద్రాసులో తెలుగు చిత్రాలు

మద్రాసు నగరంలో ఏటా సగటున 20 దాకా తెలుగు చిత్రాలు తయారవుతున్నాయి. ఈ చిత్రాలలో ఏ ఒక్కటీ ఇతర ఆంధ్రకేంద్రాలతోపాటు మద్రాసు నగరంలో వెంటనే విడుదలకావటం లేదు ఆంధ్రకేంద్రాలన్నిటా ప్రదర్శించబడిన తరవాతగాని ఈ చిత్రాలు మద్రాసు వరకూ రావటం లేదు కొన్ని తెలుగు చిత్రాలు తమిళభాషలో తప్ప మద్రాసు ప్రజలకు అందటంలేదు ఈ నగరంలో అసంఖ్యాకంగా ఆంధ్రులున్నారు. వీరిలో ఎవరిని కదిలించినా తెలుగుభాషా చిత్రాలకోసం మొగంవాచి ఉన్నవారే తమిళచిత్రాలు తమిళనాడులో విడుదల అయే సమయంలోనే మద్రాసులో కూడా కనీసం రెండు సినిమా మందిరాల్లో, ఒక్కొకసారి మూడు నాలుగు మందిరాల్లో విడుదల అవుతాయి తెలుగు చిత్రాలకు ఏం కర్మ కాలిందో తెలియటంలేదు. ఒకప్పుడు తెలుగుచిత్రాలను ముందుగానే మద్రాసులో విడుదలచేస్తే నష్టంవస్తుందని డిస్ట్రిబ్యూటర్లు, ఎగ్జిబిటర్లు భయపడేవారు. ఇప్పుడు మాత్రం తెలుగువారంతా ఏ తెలుగు చిత్రంవచ్చినా ఎగబడి చూస్తున్నారనటంలో సందేహం లేదు కొంతకాలం క్రితం మద్రాసుకు దూరంగా ఉన్న పల్లావరంలో తెలుగు "సంసారం" విడుదల

మురళీ క్రాసువర్డ్సు పోటీ నెం. 15
సీలు అన్సరు
111112 11 122 11
మురళీ క్రాసు వర్డ్సు.
పలమనేరు (చిత్తూరు జిల్లా)

అయినప్పుడు ఆ చిత్రం వారాల తరబడి జయప్రదంగా నడిచింది. ప్రస్తుతం కొన్ని నెలలుగా కాసినోలో నడుస్తున్న "మల్లీశ్వరి" ఇప్పటికీ అసంఖ్యాక ప్రేక్షకులను ఆకర్షిస్తూనే ఉంది దీన్నిబట్టి తెలుగు చిత్రాలకు నగరంలో మార్కెట్ లేదనే భయ మనవసర మనిపిస్తున్నది ఆంధ్రదేశంలో జయప్రదంగా నడిచే "పెళ్ళిచేసి చూడు" "శాంతి" లాంటి చిత్రాలు ఇక్కడ కూడా విజయవంతం కాకపోవు. ఈ విషయం డిస్ట్రిబ్యూటర్లు, సినిమా యజమానులు గుర్తించాలి ఈ విషయంలో పత్రికలలోను, ఇతరత్రానూ జరిగే ఆందోళన సమర్థించ దగినది





భార్య ఆస్పత్రిలో చావుబతుకులమీద ఉన్నది. చంటిబిడ్డని తను పెంచలేడు. అందుకని పొరిగింటి అంబుజం సలహామీద రంగస్వామి తన బిడ్డని ధనికయువతి సుభాషిణికి అప్పగిస్తున్నాడు

ప్రసాద్ ఆర్టుపిక్చర్సువారి మొదటి చిత్రంలో ప్రసాద్, బాల సరస్వతి, కుమారి

# సినిమా వార్తలు

అందాలరాణి సూర్యకుమారి బొంబాయి సినిమా రంగంలోకి అడుగుపెడుతోంది. ఫాల్కన్ పిక్చర్సువారు ఈమెను రెండు హిందీ చిత్రాలలోకి బుక్ చేశారు. హోమీవాడియా డైరెక్టు చేస్తున్న "సింహళ ద్వీప్" అనేది ఒక చిత్రం. నానాభాయ్‌భట్ డైరెక్టుచేస్తున్న "పాసింగ్ షో" అనేది మరొక చిత్రం. ఒక దానిలో అశోక్‌కుమార్‌తోను, మరొక దానిలో దిలీప్‌కుమార్‌తోను కలిసి నటిస్తున్నది. "సింహళద్వీప్" పూర్తిగా సంగీతం మీద ఆధారపడిన చిత్రమట. కర్నాటక, హిందూస్థానీ సంగీతాలు రెంటిలోను ప్రావీణ్యం సంపాదించిన సూర్యకుమారి ఈచిత్రంలో పాటలమీద పాటలు గుప్పించేస్తుందని తెలుస్తోంది.

తన పేరుమీదుగా సూర్యకుమారి టి ఎస్ కె పిక్చర్సు అనే సినీసంస్థను స్థాపించింది. కొత్త చిత్రం తీయటానికి నిర్ణయాలు జరుగుతున్నాయి.

*    *    *    *

సారంగపాణి, టి ఆర్. రామచంద్రన్, మరి ఇద్దరు తమిళ హాస్యనటులు కలిసి ఉమ్మడిగా ఒక చిత్రం తీస్తున్నారు. ప్రారంభోత్సవం మే 28 వ వాహినీ స్టూడియోలో జరిగింది. సినిమా తారలు, ప్రొడ్యూసర్లు అసంఖ్యాకంగా హాజరైనారు. ఈ చిత్రానికి ఇంకా పేరుపెట్టలేదు. "అప్‌రూ టెడ్" అనే గొప్ప బెంగాలీ చిత్రాన్ని తీసిన నిమాయ్‌ఘోష్ ఈ చిత్రానికి దర్శకుడు, కెమేరా మాన్.

*    *    *    *

బెర్లిన్‌లో జరుగనున్న చలనచిత్రోత్సవానికి ఆహ్వానింపబడిన తెలుగు ప్రొడ్యూసరు ప్రకాశరావు, తార జి వరలక్ష్మి, తమిళ ప్రొడ్యూసరు కె సుబ్రహ్మణ్యం ఈ నెల 8 వ తేదీన విమానంలో బయలుదేరి పోతున్నారు. వీరు బెర్లిన్‌లో ఉన్నంత కాలం తూర్పు జర్మన్ ప్రభుత్వ అతిథులుగా ఉంటారు.

*    *    *    *

యువా పిక్చర్సువారి "టింగ్‌రంగా" సెన్సార్ అయింది. ఈ 6 వ తేదీన విడుదల కావచ్చు.

*    *    *    *

సంగీత దర్శకుడు ఘంటసాల వెంకటేశ్వరరావు నిర్మాత కూడా అయ్యారు. తెలుగులోను, అరవంలోను ఈయనతీస్తున్న చిత్రానికి ఆయనే సంగీత దర్శకుడు. కమాల్‌ఘోష్ దర్శకుడు, కెమేరా మాన్. రామశర్మ, సావిత్రి పడుచుజంటగాను, ముక్కామల, జి వరలక్ష్మి పెద్ద జంటగాను నటిస్తున్నారు. రేలంగి, సి ఎస్ ఆర్., తదితరులుకూడా నటిస్తున్నారు. ఈ చిత్రానికి దేవకీబోసు తీసిన "సోనేర్ సంసార్" మాతృక అని తెలుస్తున్నది. అప్పుడే రెండుపాటలు రికార్డు అయ్యాయికూడా. ఇటీవల ఒక సందర్భంలో ఏచిత్రంలోవో చెప్పకుండా ఘంటసాల రెండు పాటలుపాడి విన్నవారిని తన్మయులను చేశాడు. అవి ఈచిత్రంలోవేనని తెలుస్తోంది.

*    *    *    *

ఘంటసాల తీసే చిత్రానికి పాటలు, మాటలు అభ్యుదయకవి ఆరుద్ర రాస్తున్నాడు. ఆరుద్ర శ్రీశ్రీతో కలిసి చేతనావారి జానపదచిత్రం "దేశద్రిమ్మరి" కి (కనకం, శ్రీరామ్మూర్తి) కూడా పాటలు, మాటలు రాస్తున్నాడు. డయానా వారి "రిక్షావాలా"కు కూడా బుక్ అయినాడు కాని ఆ చిత్రం షెడ్యూల్ తెలియటం లేదు. ప్రస్తుతం అతడు రాజ్‌కపూర్ తెలుగులోతీస్తున్న "ఆ!"



ప్రతిభా వారి "చిన్నకోడలు"లో కృష్ణకుమారి

ఆ చిత్రానికి పాటలు మాటలు రాయటంలో నిమగ్నులై ఉన్నాడు. ఈ చిత్రం మూడోవంతువరకూ అయిందట.

శ్రీ శ్రీ జూన్ నెల మధ్యభాగంలో విడుదల కావచ్చునని తెలుస్తున్న "మరదలు పెళ్లి"కి కాకుండా హెచ్. ఎమ్. రెడ్డిగారి ఒక చిత్రానికి, "పాలేరు" చిత్రానికి, జూపిటర్ వారి కొత్త చిత్రానికి పాటలు రాస్తున్నాడు. మైసూరు సినిమా సంస్థ ఒకటి తీయబోయే చిత్రానికి కూడా ఇటీవలే డైలాగ్సు రాయటం పూర్తి చేశాడు.

* * *

నేషనల్ ఆర్టు థియేటర్సు సభ్యులైన ఎన్. టి రామారావు, జి. వరలక్ష్మి, పేకేటి శివరాం, సుమ్మిడి వెంకటేశ్వరరావు మొదలైన నటీనటులు నెలరోజులపాటు ఆంధ్రదేశంలో సుమారు 21 కేంద్రాల్లో నాటకప్రదర్శనాలిచ్చి, రాయలసీమ క్షామ



ఇటీవల భీమునిపట్నం, విశాఖపట్నం మొదలైన చోట్ల "కూలి వెంకన్న" బుర్రకథ చెప్పుతూ పర్యటించిన ఎమ్. ఆదినారాయణ, డి. రామారావు, సి. బసవరాజు గార్లు.

నిధికి ధనం సేకరించి గత నెల 25వ తేదీన త్యాగరాయనగర్, వాణీమహల్‌లో విరాళ ధనాన్ని ఆంధ్రప్రభ నిధికి సమర్పించారు. ఆ సందర్భంలో "కరువురోజులు" "దారిన పోయే దానయ్య" అనే రెండు నాటికలు కూడా ప్రదర్శించారు. అంతా కలిపి ఈ బృందంవారు లక్షా అయిదు వేల రూపాయలు పోగుచేశారు. అనేక కష్టనష్టాలకు ఓర్చి ఇంత స్వల్పకాలంలో ఎన్. టి. రామారావుబృందం ఇంత మొత్తాన్ని క్షామపీడితులకొరకు సేకరించగలగటం అభినందనీయమైన విషయం. ★





## గ్రంథ స్వీకారం

కన్నీటిజాలు : పద్యకావ్యం రచన : స్ఫూర్తిశ్రీ ప్రచురణ : విపంచికాప్రచురణ, కాకినాడ. వెల రు 1-0-0

చిత్రలేఖ : భగవతీచరణ శర్మ హిందీలో వ్రాసిననవలకు తెలుగు అనువాదం. అనువాదకుడు. ఎస్. వి. నరసింహారెడ్డి, ప్రతులకు: ఎస్. వి. నరసింహారెడ్డి, దంతాలపల్లి. వెల రు. 3-8 0

ఖైదీ: నవల. రచన : పడాలరామారావు. ప్రచురణ : ప్రజాసాహితి, జాంపేట, రాజమండ్రి. వెల రు 1-8-0

అమూల్య పరిశ్రమలు, సబ్బులు, హెయిరాయిల్స్, ఎసెన్సులు వగైరాతయారు చేసే విధానాలు. రచన : ఆర్. బంగారయ్య. ప్రచురణ : శ్రీసత్యదేవ్ అండ్ కో, నజీర్ మంజిల్, మోజంజాహి రోడ్డు, హైదరాబాదు—(ద) వెల రు. 2-0-0

నసీబ్ (నాటిక): రచన, వైద్యుల శ్రీనివాసరావు. ప్రచురణ : విజయ పబ్లికేషన్స్ విజయవాడ.

పేదపడుచు (సాంఘిక నాటకం): రచన. సీతంరాజు వెంకటేశ్వరరావు, ప్రచురణ: విజయ పబ్లికేషన్స్, సీతన్నపేట, విజయవాడ. వెల : రు 1-8-0.

సినీటెక్నీషియన్స్ జర్నల్ (ఇంగ్లీషు) సి టి. ఎ. ఎడిటోరియల్ బోర్డు సంపాదకత్వం కార్యాలయం: కాంగ్రెస్ మైదానం, తైనాంపేట, మద్రాసు - 6.

తత్వ సందేశం : (కీర్తనలు) కర్త: ఉమర్ ఆలీషా మహాకవి. ప్రచురణ : శ్రీ ఉమర్ ఆలీషా గ్రంథ ప్రచురణ సంఘం, పిఠాపురం. వెల : రు 4-8-0.

సుహేలీ : (బొమ్మల కథ) - బొమ్మలు—లావు. ప్రచురణ. సుహేలీ ప్రచురణలు, మైలాపూరు, మద్రాసు-4. వెల 6 అణాలు

మీ అదృష్టం :—(నందన సంవత్సరంలో సూర్యమానాన్ని అనుసరించి మాసవారీ రాశిఫలితాలు) ఒక్కొక్క రాశి ఫలితాలు తెలిపే పుస్తకం వెల 4 అణాలు. గుణించినవారు ప్రొ. జి ఎస్. రావ్. ప్రచురణ నియో న్యూస్ హవుస్ 318, ట్రిప్లికేన్ హైరోడ్డు, మద్రాసు-5.

**యుగవాణి :—** తెలుగుమాసపత్రిక వెల 6 అణాలు. సంపాదకుడు : దేవరపల్లి ముస్తాక్ రావు. మేనేజింగ్ ఎడిటర్ : పగడాల లక్ష్మయ్య, కార్యాలయం-తెనాలి.



# అదృష్టకవచం

(6-వ పేజీ తరువాయి)

పోరతులు అతి వినయ గాంభీర్యాలతో స్వీకరిస్తూ భరించాలి. స్వయంగా కలిగే అనారోగ్యం, బాధ, మంచీ, చెడ్డా, నిర్లక్ష్యంగా సహిస్తూఉండాలి. గుమాస్తా హృదయం ఒక అగ్నిపర్వతాల నిలయం. అన్నీ ప్రేలటానికి సిద్ధంగా ఉంటూ ఉన్నట్టే ఉంటాయి. ఈ అన్నిటిని అణచి వాటివాటి హద్దులలో ఉంచగలిగిన జితేంద్రియత్వం, సర్వ నియంతృత్వం, సమర్థత, అన్నీ తన శరీరంమీద, తనమీద మాత్రమే కలిగి ఉండేవాడు గుమాస్తా మాత్రమే. ఆ జీవితంలో చొచ్చుకున్నంత వరకు రెవరికీ అర్థంకాదు. నాకూ మొదటి సారి చూచినప్పుడు పరవాలేదు. ఈ గౌరవనీయమైన జీవితంలో తేలాడుతూ ఉండే గుమాస్తా సోదరులలో నేనూ ఒకణ్ణై పెటపెటలాడే సాంసారిక కష్టమయ జీవితాన్ని వచ్చే రూకలతో కొంచెం శాంత పరచవచ్చు అని సంతోషంతో ప్రవేశించా.

ఎక్కడ పోయినా మన ముఖాననే పొద్దుపొడిచిందన్నట్లు ఉద్యోగాభివృద్ధులు యేవి వచ్చినా సిఫారసులు, పెద్ద చదువులు, నిమ్న వర్గత్వం, కావలసి వచ్చేది. ఒకప్పుడు సిఫార్సులు లేవని, వేరొకప్పుడు పెద్దచదువు లేదని, పై ఉద్యోగం వచ్చే చోట అడ్డంకి. అట్టే చూస్తూండగానే తోటివాళ్లంతా చకాచకా పైకి యెక్కిపోవడం, మనం ఉన్నచోటనే ఉండడం. ఎవరితోనైనా చెప్పితే సానుభూతి వాక్యాలతో 'నిజంగా అన్యాయమే జరిగింది. ఇట్లా జరగటం తగదా'ని విచారించేవారు. అంతా అందోళన పడేవారే. కాని ఫలితం అంతే. కర్మ, ప్రాప్తం, అదృష్టం!

ఇటువంటి దుర్భరకష్టమయ జీవితంలో, ఉపకార వేతనం (పెన్షను) తీసికొనే వరకూ గుమాస్తాగానే ఉన్న నాస్థితి ఒక సారి కండ్లముందర తాండవించింది. నా కుమారుడు కూడా ఇటువంటి జీవిత నౌకలోనే పయనించాలా? ఛీ. కాదు, కాదు. పెద్ద చదువు కావాలి. పెద్దచదువు. ఏదీ? బి. ఏ., ఎం ఏ.,! ఇది చదివీ మళ్లీ గుమాస్తా కాకుంటే అపై గుమాస్తా! అదీ కాకుంటే అంతకూ పైది: ఇంతకంటే సాధించగలదేం? ప్రతి చదివేవాడు ఒక గొప్ప ఉద్యోగాన్నే దృష్టిలో పెట్టుకొని చదివితే అన్ని గొప్ప ఉద్యోగాలుంటాయా? ఉండవు. (టెక్నికల్) శాస్త్రీయ విద్యలు-న్యాయ(లా) నిర్మాణ (యింజనీరింగు) విద్యలు గొప్ప ధనసంపన్నులకు సాధ్యమైయుండగా, నావంటి సామాన్యుల కెలా అందుబాటులో ఉంటాయి? ఈ అనుకునే పై చదువు ధనం ప్రధానంగా తీసికొన్నా ఎక్కువ డబ్బు వచ్చే ఉద్యోగాలు దొరకవాయె. కాని జ్ఞానం, బుద్ధి పారమార్థిక చింతన, సదాచారాలు నేర్చుకొనే దేమైనా ఉన్నదా అంటే అదీ మృగ్యం. పెద్దచదువు, చిన్న బుద్ధి, చిన్న ఉద్యోగాలు, ఛీఛీ! ఇది నిజానికి పెద్ద 'చదువుకాదు. పెద్ద జీవితం దీనితో రాదు. పరిసరాలను బంధించే ఆర్థిక తత్వాన్ని త్యాగమయ లక్ష్యాలతో ఛేదించి, నిరామయ, నిర్విచార తాత్త్విక శుద్ధ విలక్షణమైన పూర్వఋషి జీవితం శ్రేష్ఠం. మలిన యుక్తమైనది వ్యర్థమైన అర్థచింతాపరత్వమైనదైన జీవితం నింద్యం. కాబట్టి దివ్య విజ్ఞానాన్ని బోధించే చదువే పెద్దచదువు.

ఇప్పపాటులో-'మాతృదేవోభవ!- పితృదేవోభవ!- ఆచార్య దేవోభవ! అతిధిదేవోభవ! సత్యంవద' ధర్మంచర, బ్రహ్మచర్యేణ తపసా దేవాః మృత్యుముపఘ్నత! కృణ్వంతో విశ్వమార్యం-యాన్యస్మాకగ్ం సుచరితాని తానిత్వయోపాస్యాని నో ఇతరాణి-' అనే వైదిక సూక్తుల్ల పరమ లక్ష్యాలతో ప్రకాశించే, గురుకులాశ్రమ భిత్తికలు కన్నులముందర నిల్చున్నై. నలువైపులనుండి, 'యధా వృక్షస్య సంపుష్పితస్య దూరాద్గంధో వాతి' అని సస్వరమైన మంత్రాధ్యయనం చెవులకు విందుగా వినవచ్చింది.

ఇటువంటి పవిత్ర వాతావరణం సృష్టించి సచ్ఛాత్రులుగా నేటి యువకులను సిద్ధముచేసి సర్వశాస్త్ర కోవిదులుగా ఎందుకు చేయరాదు? కులవర్గ భూతాదుల కుతంత్రాలు ప్రవేశించకుండా, లోభ ప్రధానమైన ధనం అడుగు పెట్టకుండా ఉండే విద్యానిలయంలో ఎందుకు పిల్లలను చదివించరాదు. పరాధీనమైన చదువు, సదాచారలేశములేని విద్య, ధనములేని వాడు అర్థించరాని విద్య, ఎందుకు? ఎందుకని అంతా కోరుతున్నారు? ఇదొక జటిల సమస్య అయిపోయింది. పోనీ... అందరి సంగతి మనకేం?-మనంమాత్రం-కాదు, నేనుమాత్రం తప్పక ఈ ప్రస్తుత మలిన వాతావరణాన్ని బహిష్కరించాలి. అబ్బాయిని గురుకులాశ్రమ విద్యలో ప్రవేశింప జేయాలి.

ప్రపంచధోరణిలోకివచ్చిచూచా. కుర్రవాడు యెప్పుడో అవతలికి వెళ్లిపోయాడు.

అప్పుడే హరిద్వార గురుకులాశ్రమం వారికి ప్రవేశనియమావళికోసం లేఖ వ్రాశా. జవాబు వారంరోజులకు వచ్చింది. 'పదేండ్లలోగా ఉన్న కుర్రవాణ్నైతేనే చేర్చుకుంటామని' ఉన్నది. ప్రత్యేక పరిస్థితులలో మా కుర్రవాణ్ణి చేర్చుకొమ్మని, 'వాడు 15 సంవత్సరాలు మాత్రమే ఉన్నాడ'ని వ్రాశా?-'సుతరామూ వీలుకాదని, గురుకులాశ్రమ నియమాల్నిబట్టి తొమ్మిది సంవత్సరాలలోగా పిల్లలనే చేర్చుకోవలసిన మాట, కాని ఈ కాలపరిస్థితులబట్టి పది సంవత్సరాలవరకు వయస్సును పొడిగించామని, అదేసంస్థ చేసిన గొప్ప ఔదార్యం, అంతకు మించి అనుమతించ వీలులేదనియు, ఇట్లు వ్రాసినందుకు క్షంతవ్యులమ'ని ఎంతో ఆప్యాయంగా జవాబు వ్రాశారు. ఈ ఉత్తర ప్రత్యుత్తరాలలో నెలరోజులు గడచినై

మొదటిభావాలు నెమరువేసుకొని వాటిని విరుద్ధ దృష్టితో విమర్శించుకొని, 'అన్యథాశరణం నాస్తి' అని కళాశాల కోసం అబ్బాయిని పరుగెత్తించా. పోయే వరకు ప్రవేశకాలం గడిచింది. సీట్లులేవని తిరుగగొట్టారు. 'ఘృతాధారం పాత్రంవా?' అనే ఆలోచనలతో ఆ సంవత్సరం చదువు పోయింది. దానికి అదృష్టమే శరణ్యంగా తోచింది తృప్తి పడడానికి.

ఎటుపోయినా అదృష్టమే-మనదేశంలో చిరకాలంనుండి కాపాడుతున్నదీ ఒకే ఒకటి-అదే, 'అదృష్టకవచం-' ★

# ఇంతకీ నేను కథ వ్రాయబోతే

(5-వ పేజీ తరువాయి)

చూద్దును గదా చెవికున్న లోలాకు కనబడలేదు.

'అదేమే నీచెవి లోలాక్కు ఏమైందే' అని చిట్టిని ఆతృతగా అడిగా. అది నవ్వుతూ చేతులుతిప్పుతూ 'ఎక్కడలోపోయిందీ పోయిందీ' అని నవ్వుతూ డ్యాన్సుపోజులు పెట్టడం మొదలుపెట్టింది. ఇదే ఇంకోక టైములో అయితే దాన్ని ఎత్తుకుని ముద్దులాడేదాన్నేగాని అసలే చిరాకుగా వుందేమో దాన్నిచూచి చాలా కోపం వచ్చింది చిట్టిమీద నాకు.

'నీమొహంలాగే వుంది, కొత్తగా చేయించాసా మెరుగైనా మాయలేదు. సాయంకాలం అంతా గెంతులు వేశావు. ఎక్కడ పడిపోయిందో ఏమో!' అని, ఇక దాన్నంటే ప్రయోజనం ఏమిటని చప్రాసీని పెట్రోమేక్సు తెమ్మని ఇల్లంతా వెదకటం ప్రారంభించా. నాతోపాటు వాడుకూడా వెదుకుతున్నాడు. పక్కలు దులిపించా. పెట్టెలు జరిపి చూపించా. తోటలో అంతా వెతికా. ఇల్లంతా గాలించా. ఎక్కడా కనబడలేదు. ఒకవేళ అన్నం పెట్టినప్పుడుగాని వంటింట్లో పడిపోయిందేమో చూదామని వెళ్లాను ఇంతలో మావారు సినిమానుంచి వచ్చినట్లున్నారు. 'ఏమిటీ గడబిడ?' అని జవాన్ని అడగడం, వాడు 'అమ్మాజీ కుఛ్ ఢూంఢ్ రహీ హై' అని జవాబు చెప్పడం వినిపించింది.

'ఏమిటి రాధా చాలా హడావుడిగా వున్నావు?'

'చిట్టి లోలాకు కనబడడం లేదు.' అన్నాను.

చప్రాసీని పిలిచి మావారు 'నువ్వు లోలాకు చూశావా?' అని అడిగారు.

వాడికి ఆమాట అర్థంకాలేదు కాబోలు వాడు వెంటనే 'జీసాబ్ మైశామ్‌కో లగాదియా' అని వాడు జబాబు చెప్పాడు.

'ఇంతసేపూ చెప్పవేమీ ఎక్కడ తగిలించావు' అని అడిగాము.

"దర్వాజేకో లగాదియా సాబ్.'

వాడి జబాబు వింటే నాకు కోపంపోయి నవ్వువచ్చింది. 'వాడికొంచెం ఇంగ్లీషు వచ్చునులా వుంది' అన్నాను నేను. వారు కొంచెం కోపంతో 'ఏంటిరా నీముఖం?' అని అడిగారు.

'ఖుప్పల్ సాబ్, మై ఆతేహీ పీఛ్ కా దర్వాజీ కో లగాదియా!'

'అరినీ బండపడ 'లాక్' కాదురా లోలాక్కు. బేబీచెవుకి పెట్టుకునేది.'

'బేబీకా కాన్ ఫూలే సాబ్ హమ్ మే దీకో మిల్ నా! ఝూడూ దసేకా బఖిత్ మే మిల్?

'ఏది? ఎక్కడపెట్టావు?'

'బేబీరోయ్‌తో బేబీ కా హాత్ మే దియావో సాబ్.'

'అరె నీదుంపతెగ బంగారువస్తువ పసిపిల్ల కిచ్చుకుంటార్రా? అది ఎక్కడ పారేసిందో ఏమో! ఎక్కడ కనిపిస్తుందిపుడు? బంగారపు వస్తువని నీకు తెలియదూ?'

'కిస్ కో మాలుం సాబ్?'

'నీబొందబలేవాడివే దొరికావు. రాధా రేపు ప్రొద్దున్నే వెదుకుదాము. ఇప్పుడీ చీకట్లో ఏం కనబడుతుంది?'

మరునాడు ఇల్లంతా వెతికాము. ఎక్కడా కనబడలేదు. ఈ పనిలో వుండిపోవడం నుంచి నా పనులకు ఆలస్యమైపోయింది. మావారి 'నాస్తా'మాట చటుక్కున జ్ఞాపకానికి వచ్చింది తొరగా అయేది వుప్మావే కదా అని అది తయారుచేశాను. అది ఆయనకు ఇష్టం లేకపోవుటచే ముక్కుతూ మూలుగుతూ సణుగుడుతో 'నాస్తా' పూర్తి చేశారు. వారు ఆఫీసుకు వెళ్లిపోయాక ఇంకోకమారు వెతికి నిష్కారణంగా ఏభయి రూపాయల సొమ్ము పోయిందే అని అనుకుని మామూలు ప్రకారం చిట్టికి జడ వేదామని ఇవతల కొచ్చాను. అది ఎక్కడా కనబడలేదు. బొమ్మరింట్లో వుందేమో చూదామని అక్కడ కొచ్చేసరికి చిట్టి తన సెల్యులాయిడ్ బొమ్మలతో ఆడుకుంటూంది. దాని ఆట ఎందుకు భంగం చేయడం? అని దూరంగా నిల్చుని చూస్తూన్నాను. ఒక తువాలు చీరలాగ కట్టుకుని పైటకొంగు ఎడంచేత్తో సర్దుకుంటూ కుడిచేత్తో ఒక చీపురుపుల్ల పట్టుకుని తన బొమ్మని ఈ విధంగా బెదరిస్తూ అడుగుతూంది.

'ఏం? తెప్పమంటే తెప్పవేం? నీకు బుద్ధిలేదు? ఎక్కల పాలేచుకున్నావు? నీ దెంగో లోలాకేదీ? కొత్తనా? నీ బాబా దానీ, నీ పని పత్తిత్తా; బొత్తిగా బయం దేకుండావుండే దొంగా తన్నాం!'

చూద్దునుగదా రాత్రినుంచి వెదుకుతూన్న లోలాక్కు దాని సెల్యులాయిడ్ బొమ్మ చెవికీ గుండుసూదికీ తగిలించి పెట్టి వుంది. దాని ముద్దుచేష్టలు చూస్తే నాకు సంతోషం పట్టలేదు. పకపక నవ్వేను. దానితో చిట్టి వెనక్కి తిరిగి చూచి సిగ్గుతో తలవొంచుకుంది. అమాంతంగా దాన్ని ఎత్తుకుని ముద్దులాడేను. 'ఎక్కడిదే నీకీ లోలాక్కు?' అని అడిగాను. 'మా పాపాయి బాబాయి మొన్న నే మదరాసెల్లి కొని తెత్తేరు. చూలు, అప్పితే ఎలా పాలేచుకుందో' అని ముద్దుమాటలలో కంప్లయింటు చేసింది.

'సరే లే అమ్మా మీ బాబా వచ్చాక చెప్పుదాంలే' అని చెప్పి అది చూడకుండా లోలాకు తీసి జాగ్రత్త చేశా. అప్పటినుండీ ఏ వస్తువ కనబడకపోయినా చిట్టి బొమ్మలగది వెదికేవాళ్లం - ఇంతకీ నేను కథ వ్రాయబోతే? ★





Edited, Printed&Published by S Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madras




భారతదేశానికి సోవియెట్ ధాన్యం. (లెవ్ జుయెంకో 15 సం॥ మాస్కో)



కోతలపండగ (పాన్యాఇవానోవా. 7 సం॥. మాస్కో)

Regd No. M. 4479

జూ౯ 6 న **విడుదల!**





యువావారి

# టింగ్ రంగా

డైరెక్టర్... B.A. సుబ్బారావు

ప్రొడ్యూసర్. P.S. శేషాచలం

రచన...... తాపి

స్టుడియో: **వాహిని**

పూర్ణా రిలీజు




Gudur